నవరక్తని, నవశక్తిని కలిగించే

నెస్‌కాఫే కమ్మని రుచితో
నూతనోత్సాహాన్ని
పొందండి.

నెస్‌కాఫే®




నూటికి నూరుపాళ్లు స్వచ్ఛ
మైన కాఫీతో తయారయ్యే
ఒకే ఒక ఇన్‌స్టెంట్ కాఫీ



ప్రపంచంలోకెల్లా
అత్యధికంగా
అమ్ముడుపోయే
ఇన్‌స్టెంట్ కాఫీ

NS-CA-3/77-TEL

## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938-1972]

శుక్రవారం : 4-11-'77
పింగళనామ సం. ఆశ్వీయుజ బ. అష్టమి
సంపుటము 71 సంచిక 7

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

★

పోస్ట్‌లో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాలచందా రు. 20-80
విడిప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ—520 003


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ
పర్వీన్ బాబీ
(ఫోటో : కాంతీలాల్ ఖత్రీ)




# ఉత్తరాలు

## యువత

23.9.77 తేదీ సంచికలోని శ్రీ సిరాజిగారి సామాన్యుని సణుగుడు పై శ్రీ మల్లెల విజయ కుమార్ గారి లేఖ చదివిన మీదట ఈ లేఖ వ్రాయవలసి వచ్చినది.

శ్రీ మల్లెల విజయకుమార్‌గారు మన మంత్రి వర్యులను విమర్శించినారు మంత్రుల ప్రవర్తన పెక్కి రాజకీయాల పై ఆధారపడి యుంటుంది. వారికి రాష్ట్ర అభివృద్ధి అంత ముఖ్యం కాదు. మంత్రులను చేసిన వారు ప్రజలు. ప్రజాచైతన్యం యువత మీద ఆధారపడి యుంటుంది. యువత అనగా విద్యార్థులు, యువన్యాయవాదులు, మరియు విద్యావంతులు ఆంధ్ర విద్యార్థులకు సినిమాల పై యున్న వ్యామోహము మరి దేని పైన యుండదు..

పి ఆర్ ఎస్. రెడ్డి. (ఖర్గపూర్)

## కొంటావా? లేదా?

ఈ వారం ముఖచిత్రం చూశాను. చూశాక పత్రిక కొంటావా, లేక చాణక్యశపథం చేయమంటావా అంటూ కోపంగా నావైపు చూస్తున్న ఎ.ఎన్ ఆర్ ని చూచి పత్రిక కొనేశాను

తల్లిదండ్రులతో గౌరవంగా ప్రవర్తించటం పిరికివాడి లక్షణమా? ఉద్యోగం దొరికేంతవరకు పెద్దలు పెళ్ళిచేసుకోకూడదనుకోవటం పిరికివాడి లక్షణమా? అసలు పిరికివాడి లక్షణాలేవి గోపాల్‌లో కనబడటంలేదు అటువంటప్పుడు ఈ కథకు పిరికివాడు అని పేరు పెట్టటం ఏమీబాగులేదు.

ఉదయకుమార్, (కుర్ధారోడ్, ఒరిస్సా)

## అభినందన ప్రశ్న?

ముఖచిత్రాలను ఆకర్షణీయంగా ముద్రించుటలో మీరు తీసుకుంటున్న శ్రద్ధకు సంతోషంగా ఉంది. ఒయ్యారపు ముఖ చిత్రంతో వెలువడిన 14 10.77 తేదీ పత్రిక అందులో వాణిశ్రీగారు రచించిన రేపటి భయం అనే కథ చిన్నదైనా బాగుంది. శాంతినిలయం రాగబంధం లాంటి మంచి సీరియల్ కథలు అందిస్తున్న మీ [మా] పత్రికకు మా హృదయ పూర్వక అభినందనలు మరియు బి వి జి పేజీలోని సినిమా శీర్షికలు ఆకర్షణీయంగా నే ఉన్నవి. కాని మాకు ఇంతవరకు బి వి జి అంటే ఏమిటో తెలియలేదు. కాబట్టి బి వి జి అంటే ఏమిటో పూర్తిగా తెలుపగలరని ఆశిస్తున్నాము.

చిన్ని రాధాకృష్ణ, [కొత్తగూడెం]

(50 వ పేజీ చూడండి)












# కాక్ టెయిల్

గుడిసేవ సుందరరామయ్య

"మిమ్మల్ని అయ్యగారు రమ్మంటున్నా రండి!" యమ భటుడిలా వచ్చి నా సీటు ప్రక్కనే నిలబడ్డాడు బసవయ్య. భీకరంగా వుండే వాడి ఆకారానికి తోడు బుంగ మీసాలు ఎదుటి వ్యక్తిని మరింత భయకంపితుణ్ణి చేస్తాయి. హెడ్ ప్యూను కావటంచేత ఎంతో అవసరమైన పరిస్థితుల్లో తప్ప బయటకు రాడు. వాడు పిలవటానికి వచ్చాడంటే కొంప మునిగిందన్న మాటే! ప్రొద్దున్నే యమ కింకరునిలావచ్చి చెప్పిస్తు సుబ్రావ్ ప్రాణాన్ని తీసికెళ్ళి మానేజర్ ఛాంబర్లో పెట్టేశాడు వాడు.

'ఎవరి పనులు వారు చేసుకోవాలని, ఆఫీసులో వున్నంతసేపు తుమ్మజిగురు పెట్టి అంటించినంత గట్టిగా కుర్చీలో అతుక్కుని కూర్చుండాలని' వగైరా పాఠాలు యమ లోకంలో - ఐ మీన్! మా మానేజర్ ఛాంబర్లో నేర్చుకొని తిరిగి ప్రాణాలతో వచ్చేశాడు సుబ్రావ్.

నేను బసవయ్య వెనుకే వెళ్తుంటే తోటి వుద్యోగులంతా శవాన్ని చూసి ఏడ్చే బంధువుల్లా దిగులుగా ముఖాలు పెట్టారు.

నన్ను యమలోకంలోకి పంపించి బసవయ్య బయట నిల్చున్నాడు. మానేజర్ ఫైల్లో పేజీలు తిప్పుతున్నాడు.

అది చిత్రగుప్తుని చిట్టాలా వుంది.

"గుడ్ మార్నింగ్ సార్!" అన్నాను.

తలెత్తి నావైపు చూసి, "ఓ మిష్టర్! ఆనందరావ్! కమాన్! టేక్ యువర్ సీట్!" అంటూ కుర్చీ చూపించాడు.

"మీరు లీవ్ ఎప్పటిదాకా అప్లయ్ చేశారు?"

పిడుగులు విసురుతున్నట్లయింది. నేను అనుకొన్నంతపనీ జరగబోతూంది. ప్రొద్దున్నే లేచి అన్నపూర్ణ ముఖం చూడక పోవటం చేతనే ఈవేళ ఈ కర్మ పట్టింది. మానేజర్‌తో అక్షింతలు వేయించుకోక తప్పదు. నేను వెంటనే సమాధానం చెప్పక పోయేసరికి ఆయనే మళ్ళీ అన్నాడు.

"మీ కీ విషయం వ్రాద్రోజుల క్రితమే చెప్పాలనుకొన్నాను కాని సూపర్నెంటుగారి నడిగితే మీరు లీవ్ ఎక్స్‌టెండ్ చేశారని చెప్పారు."

నా తప్పును బయట పెడుతూనే ఏదో విషయం చెప్పాలనుకొన్నాను అంటున్న మానేజరు వింత ధోరణి నాకు అంతు పట్టలేదు.

"అవున్సార్! కావాల్సిన పనులు ఆలస్యంగా జరగటంచేత ఎక్స్‌టెండ్ చేయాల్సి వచ్చింది. ఇకముందు యిలాంటివి జరక్కుండా చూసుకొంటాను." అన్నాను తప్పు చేసినవాడిలా ముఖంపెట్టి.

"అలాంటి అవసరమే మీకు వుండక పోవచ్చు!"

ఉలిక్కిపడ్డాను. కొంపతీసి వేరేచోటకు ట్రాన్స్‌ఫర్ చేయడుగదా!

"సెలవులు పెట్టడంచేత వర్క్ ఎంత

సఫర్ అవుతుందో మీకు ప్రత్యక్షంగా తెల్సే రోజు రాబోతూంది !'

మానేజర్ మాటలు నా కర్థంకాలేదు.

"రెస్పాన్సిబిలిటీ మీ భుజమ్మీద పడే రోజు వచ్చింది."

"నా రెస్పాన్సిబిలిటీని గ్రహించాను సార్ ! ఇకముందు జాగ్రత్తగా వుంటాను" అన్నాను.

పెద్ద పెట్టున నవ్వాడు.

మా మానేజర్ అలా నవ్వుతుండగా చూడటం నాకిదే ప్రథమం.

"వెరీ, ఇంటరెస్టింగ్ ! ఇక డైలాగులు చెప్పకుండా అసలు విషయం చెప్పేస్తాను!" అంటూ బజ్జర్ నొక్కాడు.

బసవయ్య వచ్చాడు.

"రెండు గోల్డ్‌స్పాట్ తీసుకురా !" అంటూ జేబులోంచి డబ్బులు తీసిచ్చాడు. టేబుల్ వైపు బిత్తరచూపులు చూస్తున్న నన్ను వుద్దేశించి.

"మిస్టర్! ఆనందరావ్! కంగ్రాట్స్!" అంటూ నా చేతిని తన చేతుల్లోకి తీసుకొన్నాడు.

"ఏమిటి సార్ !" అన్నాను అయోమయంగా.

"యు ఆర్ ప్రమోటెడ్ !"

అది కలో, నిజమో తెలీలేదు.

ఆ సమయంలో మా మానేజర్ ప్రమోషన్ ఆర్డర్‌ను నా చేతిలో పెడ్తూంటే సాక్షాత్తూ విష్ణుమూర్తి వరమిస్తున్నట్లనిపించింది. మనస్సునిండా ఆనందం ! ఆయనిచ్చిన కూల్‌డ్రింక్ తీసుకొని ఛాంబర్లోంచి ఎలా బయటకు వచ్చానో నాకే తెలీదు.

నేను బయటకు వస్తుంటే సహోద్యోగులంతా ఆపరేషన్‌ను సక్సెస్‌ఫుల్‌గా చేయించుకొని బయటకు వచ్చిన రోగి తాలూకు బంధువుల్లా చూస్తున్నారనిపించింది.

* * *

"డియర్ ఫ్రెండ్స్! ఇప్పుడు జరుగుతున్న అర్జెంట్ సమావేశానికి కారణం మీకందరకూ తెల్సు! ఈ సందర్భంలో... సారీ ఈ శుభసమయంలో ఏంచెప్పాలో నా కర్థం కావటంలేదు..." అన్నాడు టైపిస్ట్ సుబ్రావ్.

"మాకు అర్థమైంది కాని నువ్వు కూర్చో ! ఇది యూనియన్ మీటింగ్ కాదు బల్లగుద్ది ఆవేశంగా వల్లించటానికి !" అన్నాడు గుర్నాథం సుబ్రావ్ వైపు గుర్రుగా చూస్తూ.

"మరీ అలా షేవ్ చేయకు గురూ ! అసలే చిన్నముఖం ! గురుడి ముఖం ఎలా చిన్నబోయిందో చూడు !" శర్మ కామెంట్.

"డియర్ కామ్రేడ్స్ ! ఇది ఫ్రెండ్లీ మీటింగ్ ! కోప తాపాలకు తావులేదు మన మందరం ఏకాభిప్రాయంతో వ్యవహరించి కాబోయే కార్యక్రమాన్ని జయప్రదం చేయాలి !" అన్నాడు యూనియన్ సెక్రెటరీ రామ్మూర్తి.

"మిత్రులంతా సహృదయంతో వింటానంటే కార్యక్రమాన్ని విన్నవిస్తాను." అన్నాడు సుబ్రావ్ నావైపు చూస్తూ.

సుబ్రావ్ చాలా కలుపుగోరు మనిషి. తన మాటలతో, చేష్టలతో ఎలాంటివారినైనా యిట్టే ఆకర్షిస్తాడు. నాకు ఫామిలీ ఫ్రెండ్ కూడా !

"చెప్పుగురూ !" అన్నాను.

"జాగ్రత్తగా వినండి ! మనందరికీ మిత్రుడు, ఆప్తుడు అయిన ఆనందరావ్‌కు ప్రమోషన్ రావటం మనందరికీ ఆనందం ! దాని ఈ ఆనందం మరింత అందంగా అందరం అనుభవిస్తే సార్థక మౌతుందని నా వూహ !"

"హియ్యర్...హియ్యర్..." అంటూ నేతప్ప మిగతావాళ్లంతా చప్పట్లు కొట్టారు.

"మన ఆనందరావ్ అదృష్టం అంతా యింతా కాదు ! ప్రమోషన్ వచ్చి, వున్న

(36వ పేజీ చూడండి)

## ధర్మపథం "నమఃశ్శివాయ" మంత్రం

'నమఃశివాయ' అన్నది అయిదక్షరాల పదం. పంచాక్షరీ మంత్రమని దీనికే పేరు. "ఓం నమోనారాయణాయ" అనేది అష్టాక్షరీ మంత్రం. ఈ మంత్రంలో ఓంకారంకూడా చేరి ఉన్నది. ఓంకారం చేరకుండా ఉన్నది పంచాక్షరి. దాన్నికూడా ఓంకారంతో ఉచ్చరించడం పరిపాటి.

ఈ మంత్రాలు ఒకటి మహేశ్వరునికీ, మరొకటి విష్ణుదేవునికి చెందినవే అయినా పరిశీలించి చూస్తే భేదం కానరాదు.

"నమస్కారేణ జీవత్వం
శివేతి పరమాత్మని,
అయేత్యైక మతో మంత్రః
పరబ్రహ్మ మయోహ్యసౌ."

అంటూ స్కందపురాణంలోని బ్రహ్మోత్తర ఖండంలో చెప్పబడి వున్నది.

ఇందులో నమస్కార పదంచేత జీవాత్మ తెలుపబడుతున్నదని, శివశబ్దంచేత పరమాత్మ బోధింపబడుతున్నదనీ, 'శివ' శబ్దం తర్వాత ఉన్న 'అయ' అనేది జీవాత్మ పరమాత్మల ఐక్యాన్ని బోధిస్తూ వున్నదనీ, అందువల్ల 'నమఃశివాయ' అనే యీ మంత్రం పరబ్రహ్మ మయమనీ దీని అభిప్రాయం.

శైవులకు 'నమశ్శివాయ' మంత్రమే ముఖ్యం. వారు విష్ణువును స్మరింపనైనా స్మరింపరు. వైష్ణవులూ శివుని నామాన్ని వినడానికిన్నీ ఇష్టపడరు. శివాలయం మార్గంలో ఉంటే అటు ముఖం తిప్పరు. ఒకప్పుడు కాశీక్షేత్రానికి వచ్చిన మా ఉపాధ్యాయులలో ఒక వైష్ణవులకు — అప్పుడు అక్కడ కొంతకాలం ఉన్న నేను అక్కడి విశేషాలు చూపవలసి వచ్చింది. విశ్వేశ్వరాలయం దగ్గరికి తీసుకుని వెళ్లగా, అది శివాలయం కాబట్టి లోపలికి వెళ్లడానికి ఇష్టపడలేదు. "సరే, బిందుమాధవస్వామి ఆలయందగ్గరికి తీసుకు వెళ్లు" అన్నారు. చదువుకున్న విద్వాంసులే ఇలా ఉంటే ఇతరుల సంగతి వేరే చెప్పడమెందుకూ ?

నారాయణశబ్దం బ్రహ్మమునే తెలుపుతుంది. శివశబ్దంకూడా దానినే తెలుపుతుంది.

'అయ' అనేది ఐక్యాన్ని తెలిపేదికదా ! మంత్రము ననుసరించి ఆ అర్థం వస్తుంది. కేవలం భాషాదృష్టితోను, వ్యాకరణ దృష్టితోను చూస్తే "శివాయ =శివుని కొరకు, నమః = నమస్కారం" అనే అర్థం మాత్రమే వస్తుంది

మంత్రాలలో శబ్దానికి మాత్రమే ప్రాధాన్యం.

— బులుసు వేంకటరమణయ్య



# జీవన పోరాటంలో— ఆశల ఆరాటం

సీరియల్

పి.వి.ఆర్. శివకుమార్

4

(గత సంచిక తరువాయి)

రిక్షాలోనే బస్‌స్టాండ్ దాకా వచ్చిన భానుమూర్తి అక్కడ దిగిపోయి, ఓ హోటల్లోకి దూరాడు. టిఫిన్ కానిచ్చి, అక్కడే ఎవర్నో అడిగి పాలిటెక్నిక్ చేరుకున్నాడు.

మెయిన్‌గేటు దాటి లోపలికి అడుగు పెట్టగానే, విశాలంగా వున్న కాంపౌండు, మధ్యగా వున్న అందమయిన బిల్డింగ్ కనబడ్డాయి. బిల్డింగ్‌వైపు నడిచి, ప్రిన్సిపాల్ రూమ్‌కి చేరుకున్నాడు. అప్పటికే చాలా మంది కూర్చుని వున్నారక్కడ. వాళ్లందరూ చేరటానికి వచ్చిన వాళ్లేనని తెలుసుకుని, తనూ వాళ్లదగ్గరే కూర్చున్నాడు.

ఒకరి తర్వాత ఒకర్ని పిలుస్తున్నారు. తన వంతు రాగానే వెళ్లి ప్రిన్సిపాల్‌ని కలుసుకున్నాడు భాను. శంకర్రావుగారి ప్రసక్తి రాకుండానే, ఫీజు కట్టెయ్యమని చెప్పారు ప్రిన్సిపాల్. కొండనెక్కినట్లు ఫీలవుతూ వెళ్లి ఫీజు కట్టేశాడు భాను.

రెగ్యులర్ క్లాసులు మరో రెండు రోజుల్లో ప్రారంభమవుతాయని తెలిసింది. హాస్టల్‌లోగూడా అడ్మిషన్లు జరుగుతున్నాయని విని, కొందరు విద్యార్థులతోపాటుగా ఆ ఆవరణలోనే వెనుకగా కనబడుతున్న హాస్టలు బిల్డింగ్‌కి వెళ్లాడు.

ఆ హాస్టల్ బిల్డింగ్స్ తీర్చిదిద్దినట్లుగా వున్నాయి. వరసలు తీర్చినట్టుగా రెండు వైపులా బ్లాకులు. రెండేసి బ్లాక్స్‌కి మధ్య కావల్సినంత ఖాళీస్థలం. ఆ స్థలం. ఆ స్థలమంతటా పచ్చని పచ్చిక అందంగా, తివాసీ పరిచినట్టుగా వుంది. హాస్టలంతా కళ కళలాడుతూ తిరుగుతున్నారు స్టూడెంట్స్.

'తనూ ఇహనించీ వీళ్లతోపాటుగా — వీళ్లలో ఒకడిగా—ఎవరి అదుపూ, అదలింపూ లేకుండా స్వేచ్ఛగా' —

చాలా సంతోషం అనిపించింది భానుకి.

హాస్టల్లోనే వున్న ఆఫీస్‌రూంకి వెళ్లి ఫీజు కట్టేసి, రూమ్ నంబర్ అలాట్ చేయించుకున్నాడు. గది వెతుక్కుంటూ వెళ్లాడు.

ఆ గదిలో అప్పటికే మరో స్టూడెంట్ వున్నాడు.

అతను ఒక పక్కగా వున్న మంచంమీద కూర్చుని, వీక్లీ తిరగేస్తున్నాడు.

భాను వెళ్లి, తనని తాను పరిచయం చేసుకున్నాడు.

"ఐసీ! నా పేరు రఘురాం. సెకండియర్ చదువుతున్నాను. లోపకి రా!" అంటూ భానుని లోపలికి ఆహ్వానించాడు అతను.

"అదిగో — అది నీ కాట్. అవి నీ ఛైరూ, టేబిలూ! నువ్వు నిజంగా అదృష్టవంతుడివి" అన్నాడు.

"ఎందుకని?" అన్నాడు భాను ఆశ్చర్యంగా.

"ఎందుకంటే — సింగిల్ రూంలో అలాట్‌మెంట్ దొరికింది గనక. నీ కింకా యీ హాస్టల్ గురించి తెలీదు గనక అలా అడిగావు రెండ్రోజులుపోతే నీకే అర్థమవుతుంది ఇప్పుడు మాత్రం అడిగావు గనక చెప్తాను.

ఇక్కడ డబల్ రూము అంటే – చిన్న రకం సంత లాటిది నలుగురు స్టూడెంట్లు అందులో కాపరం చెయ్యాలి. నలుగురి కోసం వచ్చే అతిథులూ, మిత్రులూ, అందరూ అందులో సర్దుకుంటూ వుండాలి! అంచేత, యీ హడావిడుల గోలలో చదువు సంగతి మర్చిపోయే ప్రమాదం వుంది!

సింగిల్‌రూములో వుండగలిగితే ఇద్దరే ఇద్దరు ప్రభుత్వంవారి కుటుంబ నియంత్రణలాగా చింత లేని చిన్నకాపురం చదువులూ, సంధ్యలూ, చక్కగా సాగించుకోవచ్చు"

చిన్నసైజు ఉపన్యాసం యిచ్చాడు రఘురాం.

"మరి ... మీ రూమ్‌లోకి యింకా ఎవ్వరూ రాలేదా—మీ క్లాస్‌మేట్స్...?"

"నో...నో...! క్లాస్‌మేట్, రూమ్‌మేట్ కావటంలో చిక్కులున్నాయి—నాకు! అందుకే, ఎవరన్నా ఫస్టియర్ కుర్రాడిని వెయ్యమని రిక్వెస్ట్ చేశాను, ఆ క్లర్కుని, అతను నాకు ఫ్రెండేలే... పోయినేడాదంతా కష్టపడి ఫ్రెండ్‌షిప్ చేసుకున్నాను ఇదిగో, యిలా 'సింగిల్‌రూం' ఎలాట్ చేయించుకోవాలనే!"

"అయితే, నాకు తెలియకుండానే మీ నుంచి సహాయం పొందానన్నమాట. థాంక్స్" నవ్వుతూ అన్నాడు భాను.

"నో మెన్షన్. మీరు—గీరూ వద్దు కమ్ ఏవేటు మైత్రీటాక్... నువ్వు నువ్వే—నేను నేనే! నువ్వూ మీరు కాదు — నేనూ మీరు కాదు! ఇంతకీ, నీ లగేజ్ ఏదీ?"

"తీసుకురాలేదు. ఈ వూళ్లో మా రిలెటివ్స్ వున్నారు వాళ్లింట్లో వుంది"

"ఓహో! అయితే యిప్పుడేం చేస్తావ్? మీ రిలెటివ్స్ యింటికి వెళ్తావా?"

"ఊఁ! వెళ్లి, భోంచేసి, లగేజ్ తెచ్చుకుంటాను."

"పోనీ — ఒక పని చెయ్యి, మెస్‌లో భోం చేసెయ్యి. తిరిగ్గా సాయంత్రం వెళ్లి తెచ్చుకోవచ్చు. ఇప్పుడు అర్జంటేముంది?"

"అలాగే" అన్నాడు భాను.

ఇద్దరూ కలిసి మెస్‌కి వెళ్లి, భోజనం ముగించుకున్నారు. దారిలో కలిసిన మిత్రుల క్కూడా భానుని పరిచయం చేశాడు రఘురాం.

నాలుగు దాటేదాకా హాస్టల్లోనే గడిపి, ఇక బయల్దేరుదామనుకొంటుండగా, రాజు వచ్చాడు!

గదిముందు సైకిలుంచి. లోపలకు వస్తున్న రాజుని చూడగానే ఆశ్చర్యపోయాడు భాను. "అరె, ఎలా వచ్చావ్?" అన్నాడు.

"కాలేజీలో లేకపోయేసరికి హాస్టల్లో వుండొచ్చునన్నారు అక్కడివాళ్లు. ఇక్కడ ఆఫీస్ రూంలో కనుక్కుని, వచ్చాను.

అమ్మ మధ్యాహ్నం నుంచీ ఎదురు చూస్తోంది నువ్వు వస్తావని, భోంచెయ్యలేదూ మధ్యాహ్నం?" అడిగాడు రాజు.

"చేశాను — ఇక్కడే!" ముభావంగా అన్నాడు భాను.

"అమ్మ అక్కడ ఎదురు చూస్తూ కూర్చుంది. వెళ్దాం—వస్తావా?" కొద్దిగా బాధనిపించింది అతడి ప్రవర్తన, రాజుకి.

"అలాగే, పద" అని, వీలైతే రాత్రికే వస్తానని రఘురాంతో చెప్పి. రాజు వెంట బయల్దేరాడు భాను. ఇద్దరూకలిసి సైకిల్ మీదే యింటికి వెళ్లారు. మధ్యలో పెద్దగా మాటలేం సాగలేదు. రాజు టెన్త్ చదువుతున్నాడనీ, వాళ్ల స్కూల్ గూడా పాలిటెక్నిక్ దగ్గర్లోనేననీ, అతను— ప్రస్తుతం వాళ్ల స్కూల్లోఏవో పరీక్షలు జరుగుతుండటాన— శలవుల్లో వున్నాడనీ— తెలిసింది భానుకి.

*జరిగినకథ 1:* అల్లరి చిల్లరిగా తిరుగుతూ చెడు సహవాసాలకిలోనైన కొడుకు భానుని పాలిటెక్నిక్‌లో చేర్పించమంటూ చెల్లెలు కౌసల్య, బావ శంకర్రావుల దగ్గరికి పంపిస్తాడు సాంబయ్య. క్రమశిక్షణకి ప్రాణం ఇచ్చే శంకర్రావుగారిసంతానం రాజు,రాధలు.




ఇంటికి వెళ్తూనే, హాల్లో ఎదురయింది కౌసల్య.

"ఏమిటి భానూ? భోజనం వేళకి వచ్చేస్తావనుకున్నాను. ఎక్కడున్నావ్ యింత సేపూ?" అంది వాళ్లని చూస్తూనే.

అతను హాస్టల్లో చేరిపోయానని చెప్పగానే అప్రతిభురాలైంది! ఇంత వేగం అతనలా చేస్తాడని ఆమె వూహించలేదు. ఇంకా అతన్ని హాస్టల్‌కి పంపడమో, తమతోనే వుంచుకోవటమో తేల్చుకోలేదామె. అలాటిది అతను ఎవరితోనూ ఒక్క మాట కూడా అనకుండానే హాస్టల్లో చేరిపోయాడని తెల్సి, మనసులో చాలా బాధపడింది. బయటికి మాత్రం ఏమీ అనలేదు. ఏమనాలో కూడా తెలియలేదు ఏమంటే ఏం బాధపడతాడో— ఏ పెడసరపు మాట విసుర్తాడో అని భయపడ్డది కూడాను. చివరికి,

"మీ నాన్న చేరమన్నాడా?"అని మాత్రం అంది.

"అవును. ఆలస్యమయిపోద్దీ, రూములు దొరకవేమో అనుకున్నాను. అయినా ఆలస్యం చేయుటం మాత్రం ఎందుకూ— ఎలాగూ చేరాల్సి వున్నాక?" అన్నాడు భాను. అతడు వేరే ఏమీ ఆలోచించకుండా అనేసినా, చివరిమాట కొంత పట్టిచ్చింది కౌసల్యకి.

మౌనంగానే,

"కాళ్లు కడుక్కురండి టిఫిన్ చేద్దాగానిరి" అంది.

ఏడు దాటుతుండగా శంకర్రావుగారు వచ్చారు. భానుని పలకరించారు,

"ఏమోయ్, ఫీజూ అదీ కట్టేశావటగా! గుడ్ ఎల్లుండి నుంచీ క్లాసులు మొదలవుతాయిట. మీ ప్రిన్సిపాల్ చెప్పారు" అన్నారు

## జీవనపోరాటంలో...

అతడు హాస్టల్లోకూడా చేరిపోయాడని చెప్పింది కౌసల్య.

"ఊహూఁ. మంచిపనే చేశావ్. తరువాత అడ్మిషన్లు దొరక్కపోతే ఇబ్బంది. రూమ్మా, అదీ చూసుకువచ్చావా? ఎల్లుండి బయల్దేరి వెళ్లి రూములో చేరచ్చు."

మరో నిర్ణయం లేదన్నట్టుగా ఆయన అలా చెప్పేక, ఇక తనేం మాట్లాడాలో తెలియలేదు భానుకి. ఈ రాత్రికే వెళ్తానని ఆయన్తో ఎలా చెప్పాలో– చెప్పినా ఆయన వింటారో, వినరో– సంశయాత్మకంగానే పూరుకుండిపోయాడు.

### 5

ఆ మూడోరోజు వెళ్లి హాస్టల్లో చేరిపోయాడు భాను. ఆరోజు నుంచే క్లాసులూ ప్రారంభమయ్యాయి.

కాలేజీ వాతావరణం, హాస్టలు జీవితం– అంతా కొత్తగా సరదాగా వుంది. మొదటి రెండు మూడు రోజులలోనే కావల్సిన టెక్స్టు బుక్సూ నోట్సులూ అన్నీ కాలేజీ స్టోర్సులో తీసుకున్నాడు.

అప్పుడే క్లాసులు మొదలయ్యాయిగనక, యింకా లెక్చరర్స్ రెగ్యులర్గా రావడంలేదు. వచ్చినవాళ్లు గూడా సగం క్లాసు విద్యార్థుల వివరాలూ, పరిచయాల్తోనూ, హైస్కూల్లోలా కాకుండా, యిక్కడ ఎంత కష్టపడ చదవాల్సి వుంటుందో హెచ్చరించటంతోనూ గడిపేస్తున్నారు.

ఎలిమెంటరీ నుండి, లోయర్ ఫారమ్స్లోకీ, అక్కడినించి హయ్యర్ ఫారమ్స్లోకి వచ్చినప్పటి రోజులు గుర్తు వచ్చాయి భానుకి. అప్పుడూ టీచర్స్ యిలాగే, 'ఇక్కడ ఎలిమెంటరీలాకాదు – యిక్కడ మీ లోయర్ ఫారాల్లాగా కాదు' అంటూ హెచ్చరించేవారు !

భానుకి యీ వాతావరణం బాగా నచ్చింది. ఇంకా చదువు ప్రారంభించాల్సిన అవసరంలేదు. రోజులో ఆరు గంటలు క్లాసులో గడిపితే చాలు–మిగతా టైమంతా అతని యిష్టం ! హాస్టల్లో చేరిన వారం రోజుల్లోనే అతనికి తగ్గ స్నేహితులు దొరికారు.

అతని రూమ్మేటు రఘురాం మాత్రం రోజు, రోజుకీ అతనికి దూరం జరిగిపోయాడు !

మొదట్లో కలుపుగోలుగా, సరదాగా వున్నా, వున్నకొద్దీ రఘురాం వరస భానుకి ఏ మాత్రం నచ్చకపోవటమే అందుకు కారణం. రఘురాం, క్లాసులు ప్రారంభించి నెల రోజులన్నా కాకముందే ఎందుకు పుస్తకాల పురుగులా మారిపోయాడో అతని కర్థంకాలేదు. పైగా, అతను సెకండియర్ విద్యార్థి ! సెకండియర్ విద్యార్థి అంటే, సోమరిగా తిరగగల అర్హత వున్నవాడు – అని అర్థం. కారణం, సెకండియర్లో ఎలాగూ గవర్నమెంట్ ఎగ్జామ్స్ వుండవు. హౌస్ ఎగ్జామ్స్ కాబట్టి, ఒకసారి ఫెయిలయినా మళ్లీ తిట్టి, పరీక్షలు పెట్టి, ఫైనలియర్లోకి నెట్టేస్తారు ! అందుకే సెకండియర్ విద్యార్థులకి చదువంటే నిర్లక్ష్యం ! మొదటి ఏడాదంతా పడిన కష్టాన్ని, సెకండియర్లో సేదదీర్చుకుంటూ గడిపేస్తారు.

కానీ, రఘురాం పరిస్థితి యిందుకు భిన్నంగా వుంది. క్లాసులో చేరిన రెండో రోజునుంచే అతను రాత్రి పది, పదకొండు దాకా ఏదో ఒక సబ్జెక్టు చదవటమో, ప్రాబ్లమ్స్ చేసుకోవటమో – నోట్సు తయారు చేసుకోవటమో చేస్తూ కూర్చుంటున్నాడు.

ఓ రోజు భాను అడిగేశాడతన్ని – 'యిప్పట్నుంచే యింత శ్రమ పడటం ఎందుకూ ?' – అని.

భానుకేసి నిశితంగా చూశాడు రఘురాం–

"ఆ సూరిబాబు చెప్పాడా నీ కివన్నీ ?"

"ఏవన్నీ ?" తెల్లబోయి ప్రశ్నించాడు భాను.

"అదే–సెకండియర్లో చదవక్కర్లేదనీ, ఫస్టియర్లో చివరి రెండు నెలలూ చదివితే చాలనీ–"

"ఎందుకు అనుమానం వచ్చింది ?"

"చూడు భానూ! నువ్వింకా యీ చదువుకీ, కాలేజీకీ కొత్తవాడివి. బాసుపడాలనీ, ఫస్టుక్లాసు తెచ్చుకోవాలనీ అనుకుంటే ఆ సూరిబాబుతో తిరగకు. అతడి మాటల్ని పట్టించుకోకు"

"క్రిందటేడంతా అతడి సంగతి నాకు బాగా తెలిసిందని చెప్పానుగా !"

ఈ కారణంగా కూడా రఘురాం భానుకి

మంచి స్నేహితుడు కాలేక పోయాడు.

'సూరిబాబు డబ్బున్న వాడనీ, జాలీగా వుంటాడనీ రఘురాంకి అతడంటే జెలసీ! అందుకే అతడంటే పడదు' అనుకున్నాడు భాను.

సూరిబాబు ఫస్టియర్ తప్పేడు. మళ్ళీ చేరేడు. ఆ కారణంగా భానుకి క్లాస్‌మేట్. ఆ కారణంగానే రఘురాంకి అతడంటే పడదు.

"చదువు మీద లక్ష్యం లేనివాళ్ళు









కా సుల్లో చేరితే తప్పక, యింకేమవుతారు?'' అంటాడు రఘురాం అతని గురించి.

''ఎగ్జామ్స్ ముందు ఫీవరొచ్చి చదవ లేక పోయేను గురూ, అందుకే తప్పేసింది అయినా మన జీవితం సుదీర్ఘం. ఆఫ్టరాల్ ఒక్కఏడు నష్టపోతే ఏంమునిగిపోయిందీ?'' అంటాడు సూరిబాబు.

''ఆ వచ్చింది ఏం ఫీవరు? పరీక్ష జ్వరమేనా? అయినా, ఏడాది పొడుగునా పేకాటతోనూ, సినిమాల్తోనూ గడిపేసి, చివరి ఒక్క నెలలోనూ చదివెయ్యాలంటే ఎలా కుదురుతుందీ? జ్వరం రాక మరే మవుతుందీ? ఇయరంతా చదివి వుంటే, పరీక్షల ముందు జ్వరం వస్తే మాత్రం పరీక్ష పోతుందా?'' అంటాడు రఘురాం.

భానుకి రఘురాం వాదనకన్నాసూరిబాబు సమర్థనే నచ్చింది. రఘురాం వాదన అంగీకరిస్తే, తనూ యిప్పట్నుంచే కష్టపడాలి మరి! అదే సూరిబాబు సమర్థనకి 'స్సై' అంటే హాయిగా కాలాన్ని పరిగెత్తించవచ్చు! అందుకే మానసికంగా రఘురాంకి దూరమైపోయాడు భాను.

క్రమంగా రెండు వారాలు గడిచాయి. క్లాసులు కాస్త 'సీరియస్‌నెస్' పుంజుకున్నాయి బానుకూడా రెగ్యులర్‌గా క్లాసులకి వెళ్ళి, నోట్సులు రాసుకుంటున్నాడు.

సాయంత్రాలు రోడ్లమీద జాలీగా దొర్లిపోతున్నాయి.

పాలిటెక్నిక్కి ఎదురుగానే ఆర్ట్సు కాలేజీ వుంది. ఆర్ట్స్ కాలేజీ వదలగానే రోడ్లన్నీ 'రంగులమయం' అవుతాయి!ఆరంగులవలలో పడితే, యింక చీకటిపడేదాకా, తిరుగుతూ గడిపేయొచ్చు!

ఈ కాలక్షేపమూ సూరిబాబు దయవల్ల, బాగానే పట్టుబడింది భానుకి. తమ వూళ్ళో వుండగా, ఎంతసేపూ ఆ తెలిసిన మొహాలే! వాళ్ళనే చిలిపి మాటన్నా అంటే, మరుపూటకే ఆ విషయం యింటిదాకా రావటం, అల్లరి కావటం జరిగేవి!

ఇక్కడలాటి గొడవ లేదు.

అందుకే హాయిగా వుంది.

ఇక రాత్రి రూముకి చేరుకుంటే, ఎవరి రూమ్‌నించి తెచ్చుకున్న ఏ పత్రిక తిరగేసినా నిద్ర ముంచుకు వస్తుంది. నిద్రరాని రోజు సెకండ్‌షో వుండనేవుంది.

''చదవకపోతే మానె — ఎస్సైన్‌మెంట్సన్నా రెగ్యులర్‌గా వుండు. లేకపోతే, చివరికి మునిగిపోతావ్—'' కసిగా అన్నాడు. వో రోజు రఘురాం.

''ఏం ఫర్వాలేదోయ్— నా దగ్గర నిరుడు తయారు చేసిన రికార్డ్సు, డ్రాయింగ్ ప్లేట్స్ — అన్నీ వున్నాయి. అవసరం అనుకున్నప్పుడు నాలుగు రోజులు కూర్చుంటే చాలు — వోవర్!'' అని, ధైర్యం చెప్పేశాడు సూరిబాబు.

'అవును' అనుకున్నాడు భాను.

ఒకరోజు సాయంత్రం కాలేజీ వదిలాక, బయటికి కదలబోతుండగా వచ్చాడు రాజు—




అతడిని చూసినప్పుడుగానీ గుర్తుకి రాలేదు భానుకి, ఆ వూళ్ళో తన కొక మేనత్తగారిల్లు అంటూ వుందని!!!

''ఏమిటీ? అస్సలు యింటికేసి రావడమేలేదు? రేపు ఆదివారం వుదయమే రమ్మంది అమ్మ.'' అన్నాడు రాజు. అలాగే వస్తానని చెప్పి పంపేశాడు భాను.

## 6

ఆదివారం వుదయం టిఫిన్ చేశాక, సూరిబాబు సైకిలు తీసుకుని శంకర్రావు గారింటికి బయల్దేరాడు భాను.

''ఏమిట్రా, మళ్ళీ యిటుకేసి చూడనైనాలేదూ?'' అంది మందలింపుగా అడిగింది కౌసల్య భానుని చూస్తూనే

''లేదత్తా! పగలంతా కాలేజీయేకదా!'' నసిగాడు భాను. ''శలవు రోజున? రెండు ఆదివారాలు వెళ్ళాయికదా! ఆ రోజుల్లో రావటానికేం?''

''శలవు రోజున...ఆఁ... శలవురోజుల్లో నోట్సులు రాసుకోటానికీ, డ్రాయింగ్స్ గీసుకోటానికీ సరిపోతోంది!''

''చాల్లే వూరుకో! ఆ నోట్సులేవో యిక్కడికే తెచ్చి, రాసుకుంటే కాకపోతుందా? శనివారంగూడా ఒక్కపూటే కదూ? మధ్యాహ్నం నించీ వచ్చేస్తే, సోంవారం పొద్దున్నే వెళ్ళొచ్చుగా! వారానికో రోజు యింటిపట్టున భోంచేయొచ్చు!''

''అవును. ఇహనించీ వస్తుంటాన్లే!'' అన్నాడు భాను.

ఆదివారమైనా, శంకర్రావుగారు ఫాక్టరీకి వెళ్తుంటారు.

పన్నెండింటిదాకా రాజుతో, రాధతో కేరమ్స్ ఆడుతూ గడిపాడు భాను. పన్నెండు దాటుతుండగా వచ్చారు శంకర్రావు గారు.

''ఏమోయ్, ఎలాగుంది కాలేజీ!'' అన్నారు భానుతో, పలకరింపుగా.

''బాగానే వుందండీ!''

''పాఠాలు జరుగుతున్నాయా?''

''ఆ! మొదలెట్టారు?''

''చదువుకున్నావా, మరి?''

''చదువుతున్నానండీ!'' మెల్లగా జవాబిచ్చాడు భాను.

''ఊరికే నాతో చెప్పటం కాదు.

## పచ్చిమిరపకాయల ఊరగాయ

**కావలసిన వస్తువులు :**

పచ్చిమిర్చి—కేజీ, చింతపండు-పావు కేజీ, అల్లం—150 గ్రా., నువ్వుల పిండి—100 గ్రా., ఆవాలపిండి — 50గ్రా., మెంతులపిండి—50 గ్రా., ఉప్పు—180గ్రా., ఆవాలు—10గ్రా., ఇంగువ—5 గ్రా., పసుపు—4 గ్రా., నువ్వులనూనె—½ కేజీ.

ముందుగా పచ్చిమిరపకాయలను కడిగి తొడిమలనుతీసి నిలువున ఒక వైపున గాటు పెట్టవలెను చింత పండును ఒక గిన్నెలో వేడినీటిలో నాన బెట్టి చిక్కని రసమును తీయవలెను. ఈ రసముకు ఉప్పును కలపవలెను. అల్లమునుకడిగి పైపొట్టునుతీసి చిన్న చిన్న ముక్కలుగా కోసుకోవాలి. కొంచెము నూనెలో బ్రౌన్‌కలర్ వచ్చు వరకు మిరపకాయలు వేయించాలి. నువ్వులపిండి, ఆవాలపిండి, మెంతుల పిండి విడివిడిగా కొంచెము నూనెలో వేయించాలి. అల్లము ముక్కలను పొడి చేసిన ఇంగువను, పసుపును మిగిలిన నూనెను ఆవాలుతప్పఅన్నిటినీ కలపాలి కొంచెము నూనెలో ఆవాలను పోపు పెట్టాలి. అన్నీ కలిపివేసిన తరువాత పొడిగావున్న జాడీలోకి నింపాలి

— జి. త్రిపురసుందరీదేవి

హైస్కూల్లో చదివినట్టే, యిక్కడా చదివితే అలాగే వుండిపోతావ్

"కష్టపడి చదివినవాళ్లే పట్టీలు కొడుతుంటారు ప్రొఫెషనల్ కోర్సుల్లో! మరి నువ్వు అంత కష్టపడే మనస్తత్వం వున్న వాడిలా కనబడవు! ఎలా చదువుతావో మరి!"

"లేదండి. జాగర్తగానే చదువుతాను."

"భోజనాలకి లేవండి" అంది కౌసల్య, వాళ్ళని అక్కడే ఆపుజేస్తూ.

! ఆ రాత్రికి అక్కడే వుండిపొమ్మంది కౌసల్య అతణ్ణి.

సూరిబాబుతో ఫస్టు షో ప్రోగ్రాం వేసుకున్న సంగతి గుర్తున్నా, ఆ మాట బయటికి అన్లేక, బలవంతంగా వుండి పోయాడు భాను.

వచ్చినరోజు అంత శ్రద్ధగా చూసే అవకాశం దొరకలేదు — అధ్యాసాలేదుగానీ, యివాళ ఉదయంనుంచీ రాధతో కలిసి కేరమ్స్ ఆడుతుంటేనూ, సన్నిహితంగా మెలుగుతుంటేనూ, ఆమెలోని ఆకర్షణ తెలిసి వచ్చింది — ఆకట్టుకుంది భానుని. పచ్చని పసిమిఛాయలో, కోలగా అందంగా వుండే మొహంతో, సన్నగా శలాకలా వుండే రాధని వాళ్ల కాలేజీలోకూడా అంతా 'బ్యూటీక్వీన్' అనే పిలుస్తారు.

పదిహేనేళ్ళ వయసేవున్నా, వయసుని మించిన చురుకుదనం, తెలివితేటలవల్ల

## జీవనపోరాటంలో...

అప్పుడే యింటర్లోకి వచ్చింది రాధ తండ్రి లాగే కాస్త పొడగరి కావటంవల్ల వయసు కూడా కాస్త ఎక్కువలాగే కనిపిస్తుంది. ఆమె మాటల్లో చురుకుదనమూ, పనిలో చలాకీతనమూ చూస్తుంటే భానుకి ఆశ్చర్యం కలిగింది. 'ఇంతే వయసున్న తన చెల్లెలు తొమ్మిదో తరగతితోనే చదువు ఆపేసింది! ఇంటి పనుల్లోనూ అంతగా కలిపించుకోదు అమ్మ చెప్పినా కూడా, విసుగ్గా, దుమధుమలాడుతూ అయిందని పించి, లేచిపోతుంది. మరి యీ రాధకి యిన్ని తెలివితేటలూ, యింత వోర్పూ ఎలా వచ్చాయో!'

అనుకున్నాడు తనలో తనే!

## 7

"బాన్లోకి వెళ్తున్నారు కదూ!"

ఆ సాయంత్రం ఫాక్టరీనించి వచ్చి, స్కూటర్ బయటికి తీస్తున్న భర్తని అడిగింది కౌసల్య.

"అవును. ఏదైనా పనుందా?" అడిగారు శంకర్రావుగారు.

"ఏంలేదు వచ్చేటప్పుడు అలాగే భానూ వాళ్ల హాస్టల్‌కేసి వెళ్ళివస్తారేమోనని! భాను వస్తే తీసుకురావచ్చుగా! రేపు వాళ్ళకి శలవేకదా —"

"అలాగే!" అన్నారాయన.

ఆయనకూడా ఆలోచిస్తూనే వున్నారీ మధ్య, వోసారి ఆ హాస్టల్‌కి వెళ్లి, భాను చదువు సంధ్యలూ గమనించి రావాలని, 'బావగారు తనమీద భారంవేసి, అతణ్ణి పంపారు. అందువల్ల అతడి బాగోగులు చూస్తుండటమూ అవసరం' అనీ!

ఎనిమిది దాటుతుండగా, తన పనులు ముగించుకుని, హాస్టల్‌కి వెళ్ళారు శంకర్రావుగారు.

భాను గదిలో లేడు,

'ఫ్రెండ్స్‌దగ్గరున్నాడు పిల్చుకు వస్తా' అని వెళ్ళాడు రఘురాం. వరండాలోకి వచ్చి నిలబడ్డారు శంకర్రావుగారు.

'ఎనిమిది దాటుతున్నా, యింకా గదికి వచ్చి చదువు మొదలెట్టక, యింకా స్నేహితుల్తో బాతాఖానీ ఏమిటో! అతనిరూమ్మేటు చదువుకుంటున్నాడు కదా! తను గూడా చదువుకోకూడదూ!'

అంతలో ఆయన దృష్టి ఎదుటి బ్లాక్ మేడమీద పడింది.

ఆ బ్లాక్‌లో ఓ గదిముందు నిలబడి తలుపు తడుతున్నాడు రఘురాం. ఓ నిముషం తర్వాత తలుపు తెరుచుకుంది. నోటో సిగరెట్, చేతిలో సీసాతో బయటకు వచ్చిన వ్యక్తినిభానుగా గుర్తించటానికి శంకర్రావుగారికి అట్టే కష్టం కాలేదు. రఘురాం ఏం చెప్పాడోగానీ, మరుక్షణం లోనే అతడు సుడిగాలిలా లోపలికి దూసుకు పోయాడు.

అయిదు నిముషాల తర్వాత, రఘురాం, భాను కలిసి, ఆ మేడ దిగి తమ గదిదగ్గరకు వచ్చేసరికి, వరండాలోనుంచీ లోపలికి వెళ్లి కూర్చున్న శంకర్రావుగారు కనిపించారు.

"ఏమిటి మామయ్యా ఇలా వచ్చారు?" అన్నాడు భాను. ఎంత అణుచుకున్నా అతడిలో కంగారు బయటపడక తప్పలేదు.

"ఏమీలేదు. రేపు శలవుకదా, యింటికి వస్తావేమో, తీసుకురమ్మంది మీఅత్తయ్య" అన్నారాయన, అంతవరకూ లోపల చెలరేగుతున్న ఉద్రేకాన్ని అదుపులో పెట్టుకుని, గంభీరంగా.

"అలాగే. వస్తాను. నేనసలు రేపుదయం వద్దామనుకున్నాను" అన్నాడు భాను గబగబ.

"ఏం, యివేళ రాత్రే వస్తే చదువు చెడిపోతుందనా?" వద్దనుకున్నా ఆయన మాటల్లో వ్యంగ్యం ధ్వనించింది.

"చదువు... ఆఁ... నోట్సు రాసుకుంటున్నాను– ఓ ఫ్రెండ్ రూములో."

"నువ్వు క్లాసులో నోట్సు రాసుకోవా?"

"రాసుకుంటాను. కానీ, అతను స్వంతంగా తయారు చేసుకుంటాడు– రెండు, **మూడు** టెక్స్టులు చదివి."

మామయ్య తను పేకాడుతున్న విషయం గ్రహించలేదని తెలిసి, అతడిలో కంగారు తగ్గి, ధైర్యం వచ్చింది.

"ఆహాఁ! మంచి స్నేహితుడే! అలాగే చదివి, బాగుపడు మరి!" గతుక్కుమన్నాడు భాను, 'ఆయన మాటల్లో ఏ శ్లేషా లేదు కదా!'

మౌనంగా పదినిముషాల్లో బట్టలు మార్చుకుని, ఆయన వెనకే నడిచాడు.

ఇంటికి వెళ్లగానే, భోజనాలు సిద్ధంగా వుంచింది కౌసల్య.

"ఈ పూటే వస్తావనుకున్నాను. రాలేదేం? మీ మామయ్య వచ్చేసరికి గదిలోనే వున్నావా?" మామూలుగా అడిగింది కౌసల్య.

"భోజనాల దగ్గరేనా మీ కబుర్లన్నీ? మాట్లాడకుండా తినలేవూ?" కసిరాడు శంకర్రావుగారు. భర్త ధోరణి అర్థంకాకపోయినా, తల వంచుకు భోజనం కానిచ్చిందామె.

తిరిగ్గా హాల్లో కూర్చున్నాక అన్నారాయన.

"ఇప్పుడుచెప్పు మీ అత్తయ్యతో–నేను వచ్చేసరికి ఏం చేస్తున్నానో!"

## జీవనపోరాటంలో...

"మామయ్య వచ్చేసరికి నేను రూంలో లేనత్తా! మా ఫ్రెండ్ రూములో నోట్సు రాసుకుంటున్నాను. ఇంతలో మా రూమ్మేట్ వచ్చి చెప్పాడు."

"షటప్! రాస్కెల్" శంకర్రావుగారి గర్జనతో, భానుతోపాటు రాజా, రాధా కూడా ఫులిక్కిపడ్డారు. ఆయన స్వతహాగా కోపిష్ఠి మనిషే అయినా, కొత్తవాళ్ల మీద అలా అరవటం వాళ్ళు ఎరుగరు!

"నిజంచెప్పు నువ్వు చదువుకుందామనే వెళ్ళావా?"

తలొంచుకున్నాడు భాను.

"చదువుకోవాలని లేకపోతే, మీ నాన్నతో పాటుగా వ్యవసాయం చేసుకోరాదూ! ఆయన చేతికి ఆసరాగా అయినా వుంటావ్? వయసు మీదపడుతున్న కొద్దీ, ఆయన బాధ్యత తగ్గించటంపోయి, ఆయన గుండెల మీద పెరుగుతున్న కుంపటిలాగా తయారవుతావా! బుద్ధిలేదూ!" అంటూ భార్య వైపు తిరిగాడాయన.

"నే వెళ్లేసరికి నీ మేనల్లుడు చేస్తున్న నిర్వాకమేమిటో తెలుసా? షోగ్గా సిగరెట్ కాల్చుకుంటూ, పేకాడుతున్నాడు!"

"ఆఁ..." నిర్విణ్ణురాలైంది కౌసల్య, "నిజమేనా మీరనేది?"

"వాణ్ణే అడుగు."

"ఏరా – భానూ?"

"అబ్బే... నేను... పేకాడట్లేదు..."

"ఒప్పుకొనే దమ్ము లేకపోవటం, తప్పు చెయ్యటం కన్న నీచం! నాకు భయపడి అబద్ధమాడటంకాదు – నీ అంతరాత్మకి భయపడి తప్పు చెయ్యటం మానుకో [illegible] గాలి! చిన్న పాపాయివి కాదు – ఎవరో చెప్పటానికి!

"చెంపలు పెంచమనీ, బెల్ బాటం వెయ్యమనీ ఎవడు చెప్పాడు నీకు? ఇన్ని షోకులు తెలిసి, రోడ్లమ్మట తిరగటం తెలిసి,.చదువుకోవాలనీ, పరీక్ష ప్యాసవ్వాలనీ తెలీదూ?" అంటోన్న ఆయన ఉగ్రరూపం చూసి, అతడికి మరి మాట రాలేదు.

"గుడ్లప్పగించి చూడటంకాదు. పెట్టే బేడా సర్దుకో! మీ నాన్నకి నో ఉత్తరం రాసి పడేస్తాను, వచ్చి తీసుకెళ్లమని!

"ఇన్ని సుగుణాలున్న బుద్ధిమంతుడికి, నీకింకా చదువెందుకు? వెళ్ళి గొడ్లు కాసుకో!"

విసురుగా అక్కణ్ణుంచి లేచిపోయారాయన. రాజుకూడా లేచి, తన స్టడీరూమ్ లోకి నడిచాడు. ఆ వెనకే లేచిన రాధ తన వంక చూసిన చూపులో కదలిన నిరసనకి, అంతవరకూ లక్ష్యంలేకుండా వుండిపోయిన భాను మనసు విలవిల లాడింది.

'ఛీ యీ అనేదేదో దారిలో అనేసినా తీరిపోయేది కాదూ! యింటికి తీసుకువచ్చి రాధముందు – అబ్బా!' అనుకున్నాడు.

"ఏరా భానూ, ఏమిట్రాయిది? కాలేజీలో చేరినా, యింకా బాధ్యత తెలీకపోతే ఎలారా?"

అతడి దగ్గరగా వచ్చి కూర్చుంటూ అంది కౌసల్య. ఒక్కసారి తలెత్తి, ఆమె ముఖంలోకి చూసి, మళ్లా తలదించుకున్నాడు భాను.

"చదువుమీద శ్రద్ధ లేదంటే, పోనీ చాలా మందికి అది మామూలే! కాని, యీ వయసులోనే నీకు సిగరెట్లూ, పేకాటా కావల్సివచ్చాయా?"

"ఎప్పుడూ ఆడనత్తా...యివాళే!"

"నా దగ్గర యింకా అబద్ధాలాడకు."

మరి మాట్లాడలేదు భాను.

"మీ మామయ్య కోపం చూశావుగా! రేపుదయమే మీ నాన్నకి ఉత్తరం రాసేస్తారు. ఆ తర్వాత నీ భవిష్యత్తేమిటో వూహించుకో!

"తనెన్ని కష్టాలు పడుతున్నా, కడుపు














# వుడ్‌వార్డ్సు గ్రైప్ వాటర్

100 సంవత్సరాలకు పైగా చాతుర్యమైన
తల్లులకు విశ్వాసపాత్రమైనది.

వుడ్‌వర్డ్సు కడుపునొప్పి, ఉబ్బరం, అజీర్ణ విరేచనాలు మరియు పాపలకు
పళ్లు వచ్చేప్పుడు సంభవించే బాధలను నివారించి ఉపశమనాన్ని చేకూర్చగలదు.

AS OPPL-1-TE 77

## జీవనపోరాటలో ...

కట్టుకుని, మిగతా పిల్లల్ని పస్తులుంచైనా నీకు డబ్బు పంపి చదివించటానికి యిష్టపడ్డాడే— యిదేనా ఆయనకి నువ్వు చేసే నిర్వాకం?''

ఆమె చివాట్లకన్నా— యిదంతా తండ్రికి తెలిసిపోతుందంటే భానులో చలనం కలిగింది.

''నాన్నకి నిజంగా రాస్తారా అత్తయ్యా?'' అన్నాడు నెమ్మదిగా.

''ఎందుకు రాయరు?''

''వద్దత్తా. ఆయన బాధపడతారు. అయినా, యికముందు అలా చెయ్యను.''

''ఇవన్నీ నాతో కాదు— మీ మామయ్యతో చెప్పు. అయినా, నాన్న బాధపడతాడనితప్ప, నీకు చెడిపోతున్నానని బాధలేదూ''

తల దించుకునే కూర్చున్నాడు, సమాధాన మివ్వకుండా, భాను.

మరో అయిదు నిముషాలు కూర్చుని.

''వెళ్ళి పడుకో'' అనేసి, తను కూడా అక్కణ్ణుంచి లేచింది కౌసల్య.

వెళ్ళి మంచంమీద పడుకున్నాడే గానీ, నిద్ర పట్టలేదు భానుకి. మెదడంతా ఆలోచనలు!

''ఖర్మ కాకపోతే, యివాళ యీాయ నెందుకొచ్చాడు హాస్టల్‌కి? వచ్చినా, ఆ రఘురాం ఆ ముక్క చెప్పకుండా, తనని బయటికి పిలవడమెందుకు? పిల్చినా తను ఆ సిగరెట్‌తోనే రావటమెందుకు?

''ఏదైతేనేం తనరాత బాగుండకపోబట్టి యివాళ యీాయన కంటబడాల్సి వచ్చింది.''

నిజానికి భాను ఆయనకి అంతగా భయపడేవాడు కాదు గానీ, ఆయన తండ్రికి రాస్తానని బెదిరించటమే అతణ్ణి భయపెట్టింది.

హాస్టల్లో చేరినప్పట్నుంచి అతడి పని మూడుపూలూ, ఆరు కాయలుగా వుంది. రోజూ పేకాట, యిష్టమయిన తిరుగుడు, సినిమాలు— ఏం చేసినా అడిగేవాళ్ళు లేరు. అలాంటిది, యిప్పుడు తండ్రి గనక నిజంగానే చదువు మానేసి రమ్మని రాస్తే— ఆ వూళ్ళో ఏముంది?

అందుకే ఆ ప్రమాదం కలగకుండా జాగ్రత్తపడాలని ఆలోచిస్తూ చాలా సేపటి వరకూ అనిశ్చితంగా అలాగే పక్కమీద దొర్లాడు భాను. (ఇంకా వుంది)

# యువతరం

చిత్రకళని ఛాయాచిత్రకళని కలిపి కొత్త రకం కళని సృష్టించాలని నా ఆరాటం అంటున్నాడు నాగళ్ళ శివన్నారాయణ.



దృశ్యాన్ని కంటికి కనిపించే విధంగా కాక మరోలా ఫొటోలలో చూపటం నా కిష్టం అంటున్న ఈతడి చిత్రాల్లో కొత్తదనం కొట్టొచ్చినట్టు కన్పిస్తూంటుంది. బీకాం చదువుతూన్నప్పుడే ఓ పోటీలో ఈతడు తీసిన చిత్రానికి రాష్ట్రస్థాయిలో ప్రత్యేక బహుమతి లభించింది. ఈమధ్య జరిగిన ఒక ఎగ్జిబిషన్‌లో నాల్గు ప్రయిజులుకూడా సంపాదించుకున్నాడు. తనకంటూ ఓ సొంత కామెరాని ఇంకా కొనుక్కోలేకపోయినా రకరకాల కామెరాలు వాడటం తెల్సు, సినిమాలన్నా, నటులన్నా వ్యతహాగా ఇష్టంలేకపోయినా ఫొటోగ్రఫీ మీదవున్న అభిరుచివల్ల తరచుగా చూస్తుంటాడట. ''ది బైబిల్ అనే ఇంగ్లీషు సినిమాలోని ఫొటోగ్రఫీని నే నెన్నడూ మరువలేను'' అన్నాడు. ఇతడు తీసిన ఫొటోలు అనేక ఇంగ్లీషు, తెలుగు పత్రికల్లో ప్రచురింపబడ్డాయి. వివాహం విషయంలో కులమతాల గురించి కాని వయోభేధం గురించి కానీ నాకేం పట్టింపులు లేవంటున్నాడు కానీ తన తల్లిదండ్రులు కట్నం తీసుకోవటం గురించి అభ్యంతరం చెప్పడట. అందమైన వస్తువులన్నా, ఆడపిల్లన్నా నాకెంతో ఇష్టం అని చెప్పాడు. అయితే ఆడపిల్లల్ని దురుద్దేశంతో చూడను — అల్లరి పెట్టను అని కూడా చెప్పాడు. [— ము]

# కుటుంబానికి తగిన సంపూర్ణ ఆరోగ్య పానీయం.

**హరికి భోజనం చేసే తీరిక లేదు...**
కాంప్లాన్ అతనికి తక్షణమైన ఆహారం.
తొందరగా వెళ్లాల్సిన వారందరికీ
ఆదర్శవంతమైనది—అధికారులైనా,
ప్రయాణీకులైనా, ఆఫీసుకు వెళ్లేవారైనా.

**రవి భోజనం సరిగా చెయ్యడు...**
కాంప్లాన్‌లో ఉండే 23 అతిముఖ్యమైన
ఆహారాలు ఇచ్చే 'సంపూర్ణ' పోషణ
అతనికి ఏ ఇతర ఆరోగ్య పానీయం ఇవ్వలేదు.
అతని పోషణలో లోపం ఎలాంటిదైనా
కాంప్లాన్‌తో అతను ఆరోగ్యంగా-ఉంటాడు.

**అమ్మకి సుస్తీగా ఉండి భోజనం చెయ్యడం లేదు...**
కాంప్లాన్‌తో ఆమె త్వరగా
కోలుకొంటుంది 'సంపూర్ణ'
పోషణకు డాక్టర్లు దీనినే ఎక్కువగా
సిఫార్సు చేస్తున్నారు.

**అలసటవల్ల నేను భోజనం చెయ్యలేక పోతున్నాను...**
ప్రతిరోజూ ఒక కప్పు కాంప్లాన్ నన్ను
ఆరోగ్యంగా, శక్తివంతంగా ఉంచడమేకాక
పైకి కనబడని ఆహార లోపాలనుంచి కాపాడుతుంది.

## ఒక్క కాంప్లాన్® మాత్రమే బలానికి, శక్తికి కావలసిన 23 అతి ముఖ్యమైన ఆహారాలను సంపూర్ణంగా కలిగిఉంది.

ఒక్క కాంప్లాన్‌లోనే, ప్రతి రోజూ మీ శరీరానికి కావలసిన ప్రొటీనులు, విటమినులు, ఖనిజ లవణాలు, కార్బోహైడ్రేట్‌లు, ఇతర ముఖ్యమైన ఆహారాలు శాస్త్రీయంగా కూర్చబడిన పాళ్లలో ఉన్నాయి.

**కాంప్లాన్®**
ప్రపంచ వ్యాప్తంగా విశ్వసనీయమైనది.

కమ్మని చాకలెట్, ఏలకికాయ-కుంకుమ పువ్వ రుచులలో కూడా లభిస్తుంది!






| | |
|---|---|
| ప్రొటీన్ | నికొటినమైడ్ |
| కార్బోహైడ్రేట్ | కోలిన్ |
| కేల్షియమ్ | కాల్షియమ్ పాంటొథెనేట్ |
| లిపిడ్స్ | పైరిడాక్సిన్ (బి6) |
| ఫాస్పరస | విటమిన్ బి12 |
| సోడియమ్ క్లోరైడ్ | ఫోలిక్ ఏసిడ్ |
| (సి ఎల్ రూపంలో) | విటమిన్ సి |
| పొటాషియమ్ | విటమిన్ డి |
| ఐరన్ | విటమిన్ ఇ |
| అయోడిన్ | విటమిన్ కె |
| విటమిన్ ఎ | వీటన్నిటితోపాటు ట్రేస్ |
| విటమిన్ బి1 | ఎలిమెంట్స్ (ఆరోగ్యకరమైన |
| రిబోఫ్లావిన్ | జీవ ప్రక్రియల కోసం) |

**పాలు కలపనవసరం లేదు.**

గ్లాక్సో

CASGC-27-234 TEL




సీరియల్

# రాగబంధం

యార్లగడ్డ సరోజినీదేవి

"ఏమ్మా! కాలేజీ నుంచి వచ్చేశావా అప్పుడే?" సోఫాలో కూర్చుంటూ అడిగాడు రామనాథం

"వచ్చికూడా గంట అయింది మామయ్యా!"

"మరి శ్రీనివాస్?"

"ఇంటికి వచ్చి మరలా ఎక్కడికో వెళ్లినట్లున్నాడు!"

"వాడికెప్పుడూ ఊరిమీద పెత్తనాలేనమ్మా!"

"ఏ వయస్సు ముచ్చట ఆ వయస్సుకేగా మామయ్యా!"

*(గత సంచిక తరువాయి)*

"అయితే నువ్వూ తిరిగిరాకూడదమ్మా! నువ్వూ వయస్సులోనే వున్నావుగా?"

"ఆడపిల్లకి కొన్ని నియమాలు వున్నాయిగా మామయ్యా?"

"ఆఁ... ఇప్పుడంతగా లేవులేమ్మా! బాధ్యతలేని చదువు వాడిది. బాధ్యతతో చదివే చదువు నీది! మీ అత్తయ్య లోపల ఏం చేస్తున్నదేమిటి? టీ సంగతి మర్చిపోయినట్లున్నది!"

"మర్చిపోలేదులెండి! నాయర్ మరో పనిలో వుంటే నేనే టీ తయారుచేసి తీసుకువచ్చేసరికి ఆలస్యమయింది ముందు టీ త్రాగండి. తరువాత మాట్లాడుకుందాం!" అని టీ కప్పు అందించింది పార్వతమ్మ

"చూడమ్మా విజయా! మీ అత్తయ్య ముందుకాళ్లకి బంధాలు వేస్తున్నది!"

చిన్నపిల్లవానిలాగా రామనాథం ఫిర్యాదు

చేస్తుంటే విజయకి నవ్వు ఆగలేదు. విజయ నవ్వటం చూసి తనూ నవ్వాడు.

"ఇంతకీ నీ సుపుత్రుడు టిఫేన్‌చేసి వెళ్లాడను కుంటాను ?" పార్వతమ్మ.

"ఫ్రెండ్ దగ్గిర నోట్సు తెచ్చుకోవాలని చెప్పే వెళ్ళాడు !"

"నోట్సు బదులు ఆ ఫ్రెండ్ సినిమా టికెట్లు రిజర్వు చేయించివుంటాడు. ఆ చేత్తోనే మనకీ రెండు టికెట్లు బుక్ చేయమని చెప్పక పోయావు ? మనంకూడా సరదాగా సినిమా చూసి వచ్చేవాళ్లం !"

"మీరు మరీను !..." భర్త సరసానికి సిగ్గుపడింది పార్వతమ్మ విజయ వుండటంవల్ల ! విజయ అక్కడ వుండలేక నవ్వుకుంటూ తన గదిలోకి వెళ్లిపోయింది. విజయ వెళ్లిన తరువాత నెమ్మదిగా భార్యవైపుకి జరిగి కూర్చుని నెమ్మదిగా అడిగాడు —

"విజయ గురించి నీ సుపుత్రుడు ఏమంటున్నాడు ?"

"ఏమంటాడు ? వాడికి మాటముందే వుంటుంది కోపం. ఇద్దరికీ ఈ జన్మలో సఖ్యత కలిగేలా లేదు చూస్తుంటే !"

"వాడెలాగూ పెంకె ఘటమేగాని విజయ నుంచే రావాలి వాడిలో ఏమన్నా మార్పు అంటూ వస్తే !..."

"ఏమో ? నాకేమిటో అయోమయంగా వున్నది !"

"ఎందుకని ? ఇదివరకు వాడిని గురించి నేను బాధపడేవాడిని. విజయ వచ్చిన తరువాత నాకెలాంటి బాధా లేదు. ఇప్పుడిహ వీళ్లిద్దరి మధ్యా నువ్వు బాధపడుతున్నట్టున్నావు ! అదీ కొద్ది కాలమేలే ! అవకాశం వున్నంతవరకే ఎవరయినా ఏదయినా చేయగలిగేది. సరేగాని రవీంద్ర భారతిలో చిట్టిబాబు వీణ కచేరి వున్నది. టికెట్లుకూడా తెప్పించాను. త్వరగా రెడీ అవ్వాలి !"

"ఇప్పుడా ? ?..."

"ఏం ? ? పాలిచ్చే చంటిపిల్లలు ఏడుస్తారని భయమా ? ?"

"ఏమిటండీ మీరు మరీ చిన్నపిల్లలయి పోతున్నారు ? శ్రీనివాస్ ఏ వేళకి ఇంటికి వస్తాడో? నాయర్ ఎనిమిది గంటలు కాగానే వెళ్లిపోతాడు. సుందరి తన గదిలోనుంచి యువతలకి రాదు ! విజయ ఒక్కతే వుండలేదండీ ?..."

"ఏం ?... ఎందుకు వుండలేదూ ? వంటరి తనంలోనే ధైర్యం ఎక్కువ ఎవరికైనా ? నువ్వు ముందు లేచి తయారవ్వు !"

అని తను లేచి భార్యని చెయ్యిపట్టి లేపి తను ఆఫీసు రూంలోకి వెళ్లిపోయాడు రామనాథం. చేతిలోని ఫైళ్లు డ్రాయర్‌లో వుంచి తాళం వేసి టిఫిన్ తీసుకుని కారు దగ్గిరకు వచ్చేసరికి పార్వతమ్మ యింకా లోపలనుంచీ రాలేదు. స్టీరింగ్ ముందు కూర్చుని రెండుసార్లు హారన్ నొక్కాడు రామనాథం, ఆడవాళ్లతో ప్రయాణం యింతేనని మనసులోనే విసుక్కుంటూ !

"వస్తున్నానండీ ? మీరు మరీను ! తొందర పెట్టేస్తున్నారు !" అంటూనే హాలులోకి వచ్చేసరికి సన్నజాజులు, కనకాంబరాలు కలిపి కట్టిన మాలను మేనత్తను ఆపి బలవంతంగా ముడిచుట్టూ పెట్టింది విజయ.

"అబ్బా ! నాకెందుకమ్మా యివన్నీను ? మీ మామయ్య యిప్పుడే నవ్వుతారు." అంది పార్వతమ్మ.

"మామయ్య నవ్వక ఇంకెవ్వరు నవ్వుతారు అత్తయ్యా ? పువ్వులు పెట్టుకుంటే ఇప్పుడెంత బాగున్నారో అద్దంలో చూసుకుంటే తెలుస్తుంది. అదిప్పుడు కాదత్తయ్యా ! వీణకచ్చేరికి టైం అయిపోయింది. త్వరగా వెళ్లకపోతే మామయ్యకి కోపం వస్తుంది !" తొందరచేసింది.

"చూడమ్మా విజయా ! నువ్వేమనుకోకపోతే ఒక్క మాట ?" చెప్పటానికి సందేహించింది పార్వతమ్మ.

"ఏమిటత్తయ్యా ! చెప్పండి ! నేనేమీ అనుకోను !"

"శ్రీనివాస్ ఏ వేళకి వస్తాడో ? ఏమిటో ? దగ్గిరవుండి వాడికి కడుపునిండా అన్నం పెట్టమ్మా ! తినటంకూడా చేతకాదు ! వాడేమన్నా అంటే బాధపడవద్దు ! సుందరికి చెప్పలేక కాదమ్మా ! తన కలాంటివి గిట్టవని ముందే తప్పుకుంటుంది !"

"అలాగే అత్తయ్యా ! చినబావ గురించి మీరేమీ ఆలోచించవద్దు. నేమున్నానుగా ! మీరు వెళ్లిరండి !"

విజయ చిరునవ్వుతో హామీ యివ్వటంతో పార్వతమ్మ సంతృప్తిగా బైటికి వెళ్లిపోయింది.

చిన్నబావ అంటే ఎంత ప్రేమ అత్తయ్యకి ? అవును మరి ! పెదబావకంటే సుందరిఅక్క వున్నది. చినబావకి తోడులేదుగా ! అందులో మరీ కోపిష్టి అనేది అత్తయ్య బాధ ! కారు స్టార్టు అయిన చప్పుడయి విజయ తిరిగివచ్చి హాలులోనే సోఫాలో కూర్చుంది. ఠంచనుగా ఎనిమిదిగంటలు కాగానే నాయర్ టేబుల్‌మీద వంటకాల గిన్నెలను సర్ది విజయతో చెప్పి తోటలో తనకంటూ వున్న షెడ్‌లోకి వెళ్లిపోయాడు. ముందు తలుపులువేసి తన గదిలో కూర్చుని చదువుకోసాగింది. వంటరిగా అంత ఇంటిలో వుండటానికి భయం అనిపించలేదు. తల్లి పూజలకని; పురాణాలకని తనను యింట్లో వుండి చదువుకోమని చెప్పి బైట తాళంవేసుకుని వెళ్లేది. నిద్ర వచ్చేవరకూ చదువుకుని ఆ చాపమీదనే పడి నిద్రపోయేది తను ! భయమంటే ఏమిటో యెరుగకుండా తల్లి తనను పెంచిన రీతి తలుచుకుంటే విజయకి గర్వంగా వుంటుంది. చదవాలనిపించక నోట్సుని మూసేసింది. శ్రీనివాస్ గదిలో ఏమన్నా నవలు వున్నవేమో తెచ్చుకుందామని మేడమీదకి వెళ్లింది. ఎప్పుడూ తాళం వేసుకుని వెళ్లే శ్రీనివాస్ ఆరోజు తాళం వేయకుండానే వెళ్లిపోయాడు. గడియ తీసి అతని గదిలోకి అడుగు పెట్టబోతూ వణికి పోయింది. చీకటిగా వుండటంవల్ల తలుపు ప్రక్కనే వున్న స్విచ్ తడిమి వేసింది. గదంతా వెలుతురు పరుచుకుంది. పుస్తకాలకోసం గదిని కలియచూస్తూనే గతుక్కుమన్నది...

గోడలనిండా నగ్న సుందరీమణులు కాలెండర్లు, ఫొటోలు, డ్రస్సింగ్ టేబుల్‌పై అద్దంమీద అందమయిన పాశ్చాత్య స్త్రీ నగ్నంగా వున్న చిన్న ఫొటో అంటించి వున్నది. వాటిని గోడలనుంచీ తీసి అగ్గిపుల్ల గీసి అంటించాలన్నంత ఆవేశం కలిగింది. శ్రీనివాస్ కోపం ఎలాంటిదో తెలిసివున్న విజయ నిగ్రహించుకుంది. టీపాయ్‌మీద వున్న పుస్తకం తీసుకుని పేజీలు తిరగవేసింది. "రమణి" మాస పత్రిక. పూర్తిగా శృంగార కథల పత్రికని బొమ్మలను చూసే అర్థం చేసుకుంది. ఎంత తొందరగా తీసుకున్నదో అంత తొందరగా టీపాయ్‌మీదకి వదిలింది. అలాంటి సెక్సు పత్రికలే మంచంమీద తలగడ దగ్గిర వున్నాయి. వాటినిబట్టి శ్రీనివాస్ మనస్తత్వం పూర్తిగా అర్థమయిపోయింది విజయకి. జుగుప్సతో విజయ నరనరం ద్వేషించుతోంది.

విడిచిన బట్టలు కుర్చీలనిండా మంచంమీదా గలీజుగా వున్నాయి. వాటిని అజ చూసి లాండ్రీకి వేసేదెప్పుడు ? ఎవరు ?? తిరిగి శ్రీనివాస్ వేసుకునేది ఎప్పుడు ? ? బీరువా తాళాలు బీరువానే వేలాడుతున్నాయి. మనిషికి ఎంత నిర్లక్ష్యమో ఆ గది తీరు చూస్తేనే అర్థం అయింది విజయకి. ఇలాంటివాళ్లు ఎప్పటికీ బాగుపడరు ! అనుకుంటూ వెనుతిరిగేసరికి గోడని నిలువెత్తు ఫొటో విజయని ఆకర్షించి తక్కున ఆపేసింది.

శ్రీనివాస్ టెన్నిస్ బాట్ పట్టుకుని వైట్ నిక్కర్ బనీయన్‌తో తీయించుకున్న ఫుల్‌స్కేప్ ఫొటోను చూస్తూ నిలబడిపోయింది.

చిరునవ్వులు చిందించుతూ సైడ్‌లాక్సుతో మూతిమీద వత్తుగా నల్లగా వున్న మీసకట్టు శ్రీనివాస్‌కి ఎంతో అందం తెచ్చింది. ఇంత సుందర

**జరిగిన కథ – 6 :** ముప్పయ్యేళ్లతర్వాత పుట్టింటి కెళ్లిన పార్వతమ్మ, వదిన జానకి చనిపోవటంతో చిన్ననాడే తండ్రిని, ఇప్పుడు తల్లిని కోల్పోయిన విజయని తనతో తీసుకువస్తుంది. తన ఈ ఉన్నత స్థితికి కారణం భార్య పార్వతమ్మేనని రామనాథం నమ్మకం. పార్వతమ్మ పెద్దకొడుకు భాస్కరం. అతని భార్య సుందరి. సుందరికి నల్గురితో కలిసిమెలిసి తిరగటం గిట్టదు. చిన్నకొడుకు శ్రీనివాస్‌కి దుడుకుతనం ఎక్కువ. పాతికేళ్ల క్రితం... పరంధామయ్యగారి కొడుకులు జగన్నాథం, గోపాలంల భార్యలు సుభద్ర, జానకిలు. కాపురానికి వెళ్లకుండానే వైధవ్యం పొందిన ఆడబిడ్డ పార్వతికి వివాహం చేయటానికి మామగారి అనుమతి తీసుకుంటుంది జానకి. సుబ్బయ్య మాష్టారి శిష్యుడు రామనాథంతో పార్వతి వివాహం జరిపిస్తుంది జానకి. ఇద్దరు మగపిల్లల తల్లవుతుంది పార్వతి. పార్వతి జీవితం చక్కబడిందనే తృప్తితో కళ్లు మూస్తాడు పరంధామయ్య ... విజయ బి. ఏ. లో చేరుతుంది.



నిరీక్షణ : చిత్ర రచన . కె. ఉమాదేవి

విగ్రహానికి ఎన్ని చెడు బుద్ధులు ?? ఎలా అలవడ్డాయి ? సహవాసదోషమా ?? తనకి కావలసిన పుస్తకం ఒక్కటీ లేకపోయేసరికి లైటు తీసేసి తలుపులు గడియ వేసి వచ్చేసరికి బజ్జర్ అదేపనిగా మ్రోగుతోంది అది మ్రోగే తీరు చూసి ఆ వచ్చింది శ్రీనివాస్ అని గ్రహించి పరుగులాంటి నడకతో వెళ్లి తలుపులు తెరిచింది. రౌద్రాకారంతో విజయను తప్పుకుని లోపలికి అడుగుపెట్టిన శ్రీనివాస్ హాలు నలువైపులా కలయచూశాడు తలుపులు గెడ వేసి అక్కడే నిలబడిపోయింది

"అమ్మా!"

శ్రీనివాస్ పిలుపుకి హాలు ప్రతిధ్వనించింది నిముషమయినా జవాబు రాకపోయేసరికి మరలా పిలిచాడు ఈసారీ జవాబు రాలేదు విజయ శ్రీనివాస్ వెనుకగా వచ్చి నిలబడి నెమ్మదిగా అంది —

"అత్తయ్యా మామయ్యా లేరు!"

"మరయితే ఇందాకటినుంచీ చెప్పవే ??"

"నువ్వు చెప్పనిస్తేగా ?" ధైర్యంగా జవాబు యిచ్చింది

"అంటే ?? చెప్పవద్దని నేనేమన్నా నీ నోరు మూశానా ??" తీవ్రంగా విజయవంక చూస్తూ అడిగాడు

"నోరు మూయ్యనక్కరలేదు నోరుబెట్టి అరిస్తేచాలు!"

"ఎవరితో మాట్లాడుతున్నావో తెలుస్తున్నదా ??'

# రా గ బం ధం

"ఆఁ . తెలుసు! నా మేనత్త కొడుకుతోనే మాట్లాడుతున్నాను!"

"మేనత్త అండ, మామయ్య అభిమానం సంపాదించగానే సరిపోదు! జాగ్రత్త! వళ్లు దగ్గిర పెట్టుకుని మాట్లాడు!"

"కొంచెం జాగ్రత్తగా మాట్లాడటం నేర్చుకోవటం మంచిది శ్రీనివాస్ అది యిద్దరికీ మంచిది నీలాగా అమర్యాదస్థులెవరూ లేరిక్కడ!"

"నేను మర్యాద తక్కువవాడివనేగ నీ వనేది ?..."

"నేనటం ఏమిటి ? ప్రత్యక్షంగా కనిపించుతుంటే ? ఇంట్లోకి అడుగు పెట్టటమే గావుకేకలు! అది పద్ధతి కాదు శ్రీనివాస్!"

అని లోపలికి వెళ్లిపోయింది విజయ. శ్రీనివాస్‌కి వళ్లు మండిపోతున్నది. విజయ సమాధానాలు విన్న తరువాత! ఏక వచనంతో సంభోదించటమే కాక, పేరుబెట్టికూడా పిలుస్తోంది ఎంత పొగరు ?? పైగా తనకే నీతులు చెప్పవస్తోంది ఎంతో చనువుగా వుండే వల్లీ! ఎలీజా! మేరీ! శారద తన నేనాడూ ఎదిరించిగాని, ఏకవచనంతో గాని మాట్లాడి ఎరుగరు పైగా తనేదంటే ఆ విధంగా కుక్కిన పేనుల్లాగా చేసేవాళ్లు! కట్టుగుడ్డలతో వచ్చిన ఈ పల్లెటూరి బైతు కింత పొగరా ? పళ్లు నూరుకున్నాడు తొందరగా మేడమీద తన గదిలోకి వెళ్లి చేతిలో వున్న పుస్తకాలను తలగడ క్రింద పెట్టాడు బట్టలు మార్చుకుని గదిలోనే కూర్చున్నాడు అరగంట అయినా శ్రీనివాస్ భోజనానికి రాలేదని విజయే పిలవటానికి మేడమీదకి రాసాగింది

మెట్లమీద అడుగుల చప్పుడు వినిపించిన శ్రీనివాస్‌కి ఆ వచ్చేది విజయేనని గ్రహించి తొందరగా చేతిలోకి పుస్తకం తీసుకుని చదువుతున్నట్టు భంగిమ పెట్టుకుని కుర్చీలో కూర్చున్నాడు

"భోజనానికి రా శ్రీనివాస్! వడ్డించేశాను!"

గుమ్మం యివతల వుండే పిలిచింది విజయ.

"నాకేమీ వద్దు ?" బింకంగా జవాబిచ్చాడు

"ఎందుకని ?.." ప్రశ్నించింది విజయ.

"నీకు జవాబు చెప్పే అవసరం నాకు లేదు "

"నామీద కోపమేనని తెలుస్తూనే వున్నదిగాని అన్నంమీద అలగటం మహాపాపమంటారు త్వరగా రావాఁ!"

"పాపపుణ్యాల సంగతి నాకేమీ చెప్పనవసరం లేదు నా కసలు ఆకలి లేదు!"

"మా అబ్బాయి పుట్టెడు ఆకలితో వస్తాడని అత్తయ్య అప్పగింతలు పెట్టి మరీ వెళ్లితే నీకు ఆకలి వెయ్యటంలేదంటే అసలు నమ్మను సరే! నీ కోసమని ఆగాను నేనూ భోంచెయ్యనులే!"

విజయ తిరిగి వెళ్లిపోతున్నట్లు మెట్లమీద అడుగుల చప్పుడు వినిపించటంతో పుస్తకం మూసి లేచి గుమ్మం దగ్గిరకొచ్చి చాటుగా నిలబడి తొంగిచూశాడు విజయ చివరి మెట్టుమీద నిలబడి వెనక్కి తిరిగి చూసింది శ్రీనివాస్ వస్తున్నాడేమోనని! అతను రాకపోతే అత్తయ్యకి ఏం సమాధానం చెప్పాలి ? శ్రీనివాస్ అంటే విజయకి అత్యంత అనురాగం వున్నా తానలా వ్యక్తం చేస్తే శ్రీనివాస్ మరింత మొండి ఘటం క్రింద తయారు కాగలడని, మొండితనాన్ని మొండితనంతోనే అంతమొందించితేనేగాని శ్రీనివాస్ మనిషిగా కాగలడు అనుకుంటూ హాలులో బెడ్‌లైట్ వేసి తన గదిలోకి వెళ్లి టెక్స్టుబుక్ చేతిలోకి తీసుకున్నది విజయ తన గదిలోకి వెళ్లిందని నిర్ధారణ చేసుకుని క్రిందకి వచ్చి నెమ్మదిగా డైనింగ్ రూంలోకి వెళ్లి కుర్చీలో కూర్చుని ప్లేటులో అన్నం వడ్డించుకుని ఆ తరువాత కూరలు చారు చట్నీ అన్నీ ఒక్కసారే వేసుకుని ముద్దగా కలుపుకుని తొందరగా తినసాగాడు

ఫక్కుమని నవ్వటం విని ఉలిక్కిపడి తల తిప్పి చూశాడు పమిటచెంగుని నోటిలో కుక్కుకుని వచ్చే నవ్వుని ఆపుకునేందుకు ప్రయత్నించుతోంది విజయ నవ్వుతో ఉగ్రుడైపోయాడు చేతిలోని ముద్దను క్రిందకి విసిరి పళ్లెంలో చెయ్యి కడుక్కుని లేవబోయేసరికి ఛప్పున విజయ దగ్గిరకు వెళ్లి శ్రీనివాస్ భుజం మీద చెయ్యివేసి తిరిగి అదే కుర్చీలో కూర్చోబెట్టింది భుజంమీదనుంచి చేతిని తియ్యకుండానే ఆ పళ్లాన్ని అవతలకి నెట్టి మరో పళ్లెం తీసి శ్రీనివాస్ ముందు పెట్టి ఒక్కొక్కటీ వడ్డించసాగింది

ఆశ్చర్య విస్ఫారిత నేత్రాలతో విజయవంక చూస్తూ వుండిపోయాడు శ్రీనివాస్! అతనిలోని కోపం – ఆవేశం మంచులాగా కరిగిపోయాయి, విజయ స్పర్శతో! విజయ చేతిని తన చేతిలోకి తీసుకోవాలనిపించినా ధైర్యం చాలలేదు

"తన కోపమే తన శత్రువన్నారు పెద్దలు! కోపం తగ్గించుకుని నిదానం నేర్చుకోవటం మనిషికి మంచిది చినబావా!" అంది విజయ నవ్వుతూ!

"నీ శ్రీరంగనీతులు నేను వినదలుచుకోలేదు!" తల వంచుకుని జవాబిచ్చాడు

"నువ్వు వినకపోయినా చెప్పవలసిన బాధ్యత నాకున్నది!"

"ఏమిటా అవసరం ??' విజయ మొహంలోకి చూస్తూ ప్రశ్నించాడు

"ప్రస్తుతం చెప్పేదిమాత్రం కాదు!" అదే చిరునవ్వుతో జవాబిచ్చి తన చెయ్యి శ్రీనివాస్ భుజం మీద యింకా వుండడంతో ఛప్పున తీసేసి శ్రీనివాస్‌కి •మారు అన్నం వడ్డించే నెపంతో మరోవైపుకి వెళ్లింది అది చూసి శ్రీనివాస్ నవ్వుకున్నాడు విజయ ఒక్కొక్క పదార్థమే కొసరి కొసరి వడ్డించుతుంటే మౌనంగా తినసాగాడు శ్రీనివాస్ తినే రీతిని చూస్తుంటే మేనత్త చెప్పిన మాట నిజమేననుకుంది విజయ శ్రీనివాస్‌మీద అంతులేని జాలి కలిగింది ఆ క్షణంలో! భోంచేస్తున్నవాడల్లా ఆగి తలెత్తి విజయవంక చూస్తూ అడిగాడు —

"నువ్వు భోంచెయ్యవే విజయా ?"

# ఇదిగో...సరసమైన ధరలో ఓ సాటిలేని షాంపూ

# మిస్టీ

మీ జుట్టు ఏ రకానికి చెందినది? ఏ రకమైతేనేంలెండి. ఆ జుట్టుకు తగిన ఓ షాంపూని మిస్టీ అందజేస్తుంది.

మిస్టీ బ్యూటీ షాంపూ మామూలుగా ఉండే జుట్టు కోసం. అది జుట్టును ఆమూలాగ్రంగా శుభ్రపరుస్తుంది. ఆ జుట్టుకున్న తళతళలాడే అసలైన అందాన్ని తీర్చి దిద్దుతుంది.

మిస్టీ లెమన్ షాంపూ నూనె ఓడే జుట్టుకోసం. అది మీ జుట్టుకు సజీవాకృతిని తెస్తుంది. ఆ జుట్టు పరిమళం చిందిస్తూ నవనవలాడేలా చేస్తుంది.

మిస్టీ హెర్బల్ షాంపూ పొడిగా ఉండే జుట్టు కోసం. మీ జుట్టుకు కావలసిన సహజమైన మూలపదార్థాలన్నీ గలది. మీ జుట్టును మెత్తగా, మృదువుగా, దువ్వుకునేందుకు బలే వీలుగా రూపొందిస్తుంది.

ఇదంతా...అదే సరసమైన ధరలో. బాగా ఖరీదైన షాంపూ కూడా ఇంతకన్న మేలుగా ఏంపనిచెయ్యదు.




1904వ సంవత్సరంనుండి నాణ్యమైన ఉత్పాదనలను తయారుచేస్తున్న బోస్కొ యొక్క ఉత్పాదన.

CHAITRA-BSF-1 TEL

"మామయ్యా అత్తయ్యా వచ్చిన తరువాత తింటాను!"

"నేను తినకపోతే నువ్వూ తిననన్నావుగా ?"

"... ... ..."

"మీ ఆడవాళ్లకి అబద్ధాలు పుట్టుకతోనే వస్తాయి!"

"వాటితోపాటు కొన్ని దురలవాట్లుకూడా అబ్బుతాయి!"

## రాగబంధం

"నాలో చెడు నువ్వేం చూశావని ?" శ్రీనివాస్ కంఠం తీవ్ర స్థాయి నందుకుంది ఒక్కసారే!

"నీ గది అలంకరణ చూస్తేనే అర్థం అవుతోంది!"

"నువ్వు! ... నువ్వు! ... నా గది లోకి యెందుకు వెళ్లావు ?"

"మంచి నవలేమన్నా వున్నవేమోనని! యెందుకు వెళ్లానా ? అనిపించింది వెళ్లిన తరువాత! ఆ చెత్తని చూస్తే మామయ్యా అత్తయ్య యెంత బాధపడతారో ఆలోచించావా?"

"బాధపడటానికి ఏమున్నది ? యెవరి అభిరుచులు వాళ్లవి! యెవరి అభిప్రాయాలు

వాళ్ళవి! ఒకళ్ళకోసం నా అభిరుచులను చంపుకోలేను! నా యిష్టంలేనిదే నా గదిలోకి అడుగుపెట్టకు! తెలిసిందా?''

''అవసరంవస్తే వెళ్తాను. గోడలకి నగ్నసుందరీమణుల కాలెండర్లను ఫొటోలను చింపి అవతల పారవేసే అధికారంకూడా వున్నది తప్పదుమరి!''

''ఏమిటి నీ బోడిపెత్తనం నా మీద?'' విసురుగా కుర్చీలోనుంచి లేచాడు.

''నా మీద కోపంతో పెరుగన్నం మర్చిపోయావు శ్రీనివాస్!''

అంటూ చిరునవ్వుతో అతన్ని తిరిగి కుర్చీలో కూర్చోబెట్టి మారు అన్నం వడ్డించి పెరుగు గిన్నెతోనే వంపేసింది విజయవంక చూస్తూ వుండిపోయాడు విజయ యెన్ని మాటలన్నా చివరికి ఆమె చిరునవ్వుకి లొంగిపోతునేవున్నాడు శ్రీనివాస్. భోజనం ముగించుకుని లేచి చెయ్యి కడుక్కుని విజయ అందించిన టవల్‌తో తుడుచుకుంటూ తృప్తిగా విజయవంక చూశాడు.

''పొట్లాడి మొత్తంమీద కడుపునిండా అన్నంపెట్టావు విజయా! మెనీ మెనీ థాంక్సు!''

జవాబుకయినా ఎదురుచూడకుండా తిరిగి మేడమీదకి వెళ్లిపోయాడు విజయ కళ్ళు మెరిశాయి ఇలాగే శ్రీనివాస్‌ని!..'' యింక ఆపైన ఆలోచించలేకపోయింది...

## 8

విజయ బస్సుస్టాపుకి వచ్చేసరికి రోడ్డుమీద జనం హడావుడిగా అటూ యిటూ పరిగెత్తసాగారు. ఎవరికి అందిన వాహనంలో వారు బాడుగ యెంత అని అడక్కుండానే యెక్కి వెళ్లిపోతున్నారు. ఏమిటో అర్ధంకాలేదు విజయకి ఎవరి నడిగినా సరయిన సమాధానం రాలేదు మరో అరగంట నిలబడినా ఏ బస్సూ రాలేదు పోలీస్ వ్యాన్ ఉమన్సు కాలేజీ దగ్గిర ఆగగానే రిజర్వు పోలీసులు పదిమంది మఫ్టీలోనే దిగి సాయుధులై నిలబడ్డారు వ్యాన్ వెళ్లిపోయింది అలా మఫ్టీలో వున్న రిజర్వు పోలీసులు రెసిడెన్సీ స్ట్రీటు పొడుగునా సన్నద్ధులై వున్నారు డబుల్‌డెక్కర్ బస్సు అద్దాలన్నీ పగిలిపోయి పాసెంజర్సు లేకుండానే అమిత స్పీడులో దూసుకుపోతుంటే ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయింది

గుంపులు గుంపులుగా బారులుతీరి వస్తున్న విద్యార్థులను చూసి వెనక్కి తప్పకుంది విజయ

''ఆర్. టి. సి ని వెంటనే తొలగించాలి! విద్యార్థులను నిర్లక్ష్యంచేసి తిట్టిన కండక్టర్ వెంటనే క్షమార్పణ చెప్పకోవాలి!''

అన్న విద్యార్థుల నినాదాలతో కోటీవైపు వస్తున్న విద్యార్థులను చూస్తూనే నివ్వెరపోయింది అన్ని కాలేజీలు తరలివచ్చినట్లుగా కన్పించింది జనసందోహం! ఊరేగింపుకి రెండువైపులా పోలీసులు సాయుధులై వెంట నడుస్తున్నారు ఎలాంటి దౌర్జన్యం జరక్కుండా చూసేందుకు విద్యార్థి బృందానికి నాయకత్వం వహించిన శ్రీనివాస్‌ని చూస్తూనే కలుక్కుమంది విజయ మనసు ప్రతీ చిన్న విషయానికీ తానేనంటూ బైలుదేరే శ్రీనివాస్‌మీద విపరీతమయిన కోపం



★ ★ ★ 'సతీసావిత్రి' లో ఒక దృశ్యం ★ ★ ★

వచ్చింది. తానెలా యింటికి చేరాలా? అని ఆలోచిస్తోంది. కనుచూపుమేరలో ఏ వాహనం కనిపించలేదు. అంతకంతకూ నినాదాలతో బజార్లు మారుమ్రోగిపోతున్నవి. దుకాణాలు; షాపుల భయంతో మూసేస్తున్నారు. శ్రీనివాస్ షర్టు స్లీవ్ బటన్ తీసి మోచేతివరకూ మడిచిపెట్టుకుని వెనక్కి ముందుకీ చిందులు తొక్కుతూ అరవసాగాడు.

''కండక్టర్ అపాలజీ చెప్పేవరకూ ఏ బస్సూ తిరగరాదు .... తిరిగినా క్షేమంగా వుండదు!''

శ్రీనివాస్ ఒక్కొక్క మాటా అంటుంటే విద్యార్థులు మారుపలుకుతూ కదనరంగం తొక్కుతున్నారు. ఇంతలో కొంతమంది విద్యార్థులు అటుగా వస్తున్న వ్యాన్‌మీద పడి పది నిముషాల్లో దాన్ని దగ్ధంచేశారు. అది చూసిన పోలీసులు తమ ఆయుధాలకి పని చెప్పక తప్పలేదు. తుపాకీ కాల్పులతో జనం చెల్లాచెదరౌతున్నారు. విజయ తొందరగా ముందుకు పరిగెత్తుకు వెళ్లినదల్లా ఆ సందులో వున్న టాక్సీ ఎక్కి ఫలానా చోటుకని చెప్పతుండగానే విద్యార్థుల గుంపు ఆ వైపుకి పరిగెత్తుకు రావటం; ఎవరిమట్టుకు వాళ్ళు చీలిపోయి తల దాచుకోవటం; చూసిన విజయ సీటుకి అతుక్కుపోయి.

''త్వరగా పోనివ్వు డ్రైవర్!'' అంది పెద్దగా!

జాలి తలచిన డ్రైవర్ టాక్సీని స్టార్టు చేస్తుండగా ఒక్క ఉదుటున శ్రీనివాస్ వచ్చి డోరు తెరిచి సీటులో కూలబడి వగరుస్తూ

[33వ పేజీ చూడండి]



'మొరటోడు'



'చిలిపికృష్ణుడు'

## ప్రముఖుల చిత్రాల ప్రభ

ఈనాడు జయప్రద అనుభవిస్తున్న స్థానాన్ని, ఆనాడు శ్రీ తిలక్ ఊహించివుండబట్టే, ''భూమికోసం'' చిత్రంలో ఆమెకు వేషం యిచ్చారేమో అనిపిస్తుంది

ఇంతటి అవున్నత్యాన్ని ఆమె పొందగలదని తెలిసేనేమో, ప్రభాకరరెడ్డిగారు జయప్రదకు ''నాకూ స్వతంత్రం వచ్చింది'' చిత్రంలో నాయిక వేషం యిచ్చారేమో అనిపిస్తుంది

జయప్రద ఉత్తమశ్రేణి నటి అవుతుందన్న నమ్మకంతోనే, శ్రీ విశ్వనాథ్ ''మాంగల్యానికి మరో ముడి. సిరిసిరిమువ్వ'' చిత్రాలలో నాయికగా ఎంపిక చేశారేమో అనిపిస్తుంది

శ్రీ బాలచందర్... శ్రీ త్రిలోక్‌చందర్ జయప్రదకు యిచ్చిన పాత్రలు (అంతులేని కథ... భద్రకాళి) ఆమె నట జీవితంలో శాశ్వతంగా నిలిచిపోతాయి

## ఇవాళ్టి ప్రభ ఏమిటి

ప్రముఖ దర్శకులు. అగ్రనాయకులు రూపొందిస్తున్న చిత్రాలలో ఎక్కువ శాతం నటిస్తున్న నటి ఎవరయ్యా అంటే.. జయప్రద పేరు ధ్వనిస్తుంది

''అడవిరాముడు'' సాధించిన అఖండవిజయం, జయప్రదకు అనూహ్యమైన మేలు నార్జించి పెట్టింది

ప్రస్తుతం శ్రీ రామారావు నటిస్తున్న చిత్రాలలో నాయికగా పాత్ర పోషిస్తున్నది యెవరయ్యా అంటే .. జయప్రద పేరు వినిపిస్తుంది.

శ్రీ ఎన్టీఆర్‌తో నటిస్తున్న చిత్రాలు : యమగోల, రాజపుత్ర రహస్యం...కంచుకాగడా, యుగపురుషుడు . ఆదిత్య చిత్ర.



శ్రీ నాగేశ్వరరావుతో చేసే చిత్రాలు అన్నపూర్ణా స్టుడియోస్ అండ్ జగపతి పిక్చర్స్ వారి చిత్రం, దాసరిగారి ''దేవదాసు మళ్లీ పుట్టాడు.''

శ్రీ శోభన్‌తో చిత్రాలు నాయుడుబావ

శ్రీ కృష్ణతో చిత్రాలు అల్లరిబుల్లోడు, త్రిమూర్తి ప్రొడక్షన్స్, కటకటాల రుద్రయ్య. ఇవిగాక మురళీమోహన్‌తో రెండు చిత్రాలు, శ్రీ రంగనాథ్‌తో ఒకటి ... జయప్రద నటిస్తున్న చిత్రాలు

## విజయ రహస్యం

జయప్రద యింత పెద్ద నటి కావడానికి కనిపిస్తున్న కారణాలు మూడు. ఒకటి. ఆమె సత్ప్రవర్తన. రెండు. ఆమె మెయిన్‌టెయిన్ చేస్తున్న శరీరం. మూడు. ప్రేక్షకుల ఆదరణ.



'నాయుడుబావ'లో



# సినిమా విశేషాలు

### హిందీ అవకాశం

తెలుగులో విజయఢంకా మ్రోగిస్తున్న మన జయప్రద హిందీ "సిరిసిరిమువ్వ"లో నటించడం ఒకప్రక్క ఆనందాన్ని కలిగించినా, మరోప్రక్క ఆమె మనకు కాకుండా పోతుందేమో నన్న సంశయం ఏర్పడుతుంది

### కె ఆర్ ఆర్ సీజన్

"అడవిరాముడు" చిత్రం, "ప్రేమలేఖలు" చిత్రం, "అమరదీపం" చిత్రం దర్శకుడి మేధాసంపత్తిని బుజువు చేసాయి

వైవిధ్యం వున్న మూడు కథలను, దర్శకుడు తన ప్రజ్ఞతో, ప్రాభవంతో వుత్తమంగా, జనరంజకంగా రూపొందించి, "సెహభాష్" అనిపించుకున్నాడు

"కృషితో నాస్తి దుర్భిక్షమ్" అనేడి నానుడిని రాఘవేంద్రరావు నిజం చేశారు

ఇప్పుడు ఆయన సీజన్ బలంగా. .ధనంగా ఘనంగా వుంది

రాఘవేంద్రరావుగారి మంచి "ఆమె కథ", "మట్టిమనుషులు", శ్యాంప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ "కంచుకాగడా" మున్నగు చిత్రాలు ప్రేక్షకులను అలరింపబోతున్నాయి

పాఠకులు వారి అభిమాన హీరోల చిత్ర వివరాలను గూర్చి తెలుసుకోడానికి ఎంతో వుత్సాహ పడడం సమంజసం గాబట్టి, గత వారం ఇద్దరిని పేర్కొన్నాను ఈ వారం శోభన్ కృష్ణగార్ల చిత్రాలను తెలుపుతున్నాను

### శోభన్‌బాబు !

సమత ఆర్ట్స్ నిర్మించిన రంగుల చిత్రం "మల్లెపూవు" శోభన్‌బాబుగారికి అవార్డును ఆర్జించిపెట్టే అవకాశాన్ని కలిగించింది కరుణరస ప్రధానమైన పాత్రలో, సరికొత్త శోభన్ జీవించారు. ఆయన సరసన లక్ష్మి జయసుధ శృంగార నాయికలుగా నటించారు. శ్రీ చటర్జీ .. శ్రీ యాచేంద్ర నిర్మించిన సంగీతప్రధానమైన "మల్లెపూవు" చిత్రానికి వి మధుసూదనరావు దర్శకుడు ఈ చిత్రంలోనికాశ్మీరుదృశ్యాలుప్రేక్షకులకు కన్నులపండుగ చేస్తాయి. నవంబర్‌లోవిడుదల

### గడుసుపిల్లోడు !

"వసూళ్ల" బాపయ్యగారి దర్శకత్వంలో రూపొందిన రామకృష్ణరెడ్డిగారి "గడుసు పిల్లోడు" వర్ణ చిత్రంలో శోభన్ తండ్రిగా హుందాతనాన్ని, తనయుడుగా గడుసుతనాన్ని సమాన ప్రతిభతో పోషించారు. జనరంజకమయ్యే అంశాలు యెన్నో వున్న ఈ చిత్రంలో జమున ... మంజుల నాయికపాత్రలను పోషించారు. ఈ చిత్రం లోని స్టంట్ ఫీట్స్ కొత్తరకంగా వున్నాయిగాబట్టి, మాస్‌ను ఈ చిత్రం మరింతగా ఆకర్షించవచ్చు

### లక్ష్మి ఫిలిమ్స్ కంబైన్స్

శ్రీ ఎస్ డి. లాల్ .. శ్రీ శోభన్ కలిసి పని చేసిన లక్ష్మి ఫిలిమ్స్ కంబైన్స్ వారి రంగుల చిత్రం, శోభన్‌కు "సూపర్ స్టార్‌డమ్" ను తెచ్చిపెట్టే అర్హతను బడసియుంగి

ఈ చిత్రంలో జయచిత్ర, దీప కధానాయకుడి సరసన నటించారు బలమైన కథ, బిగువైన కధనం వున్న ఈ పేరుపెట్టని చిత్రాన్ని ఎన్ ఆర్ అనురాధాదేవి కొత్త సంవత్సర కానుకగా విడుదల చెయ్యదలచారు

### నాయుడుబావ

శ్రీ ఎమ్ ఎస్ రెడ్డి రంగుల్లో నిర్మిస్తున్న



'దేవతలారా దీవించండి'

"నాయుడుబావ" చిత్రం మాస్...క్లాస్ తరగతుల, వారిని ఆకట్టుకునే కధాసంవిధానాన్ని గొనియుంది శోభన్ సగభాగం వరకు పల్లెటూరు మనిషిగా, మరో సగభాగంలో పట్నవాసం పౌరుడుగా నటిస్తున్నారు పల్లె పిల్లగా జయప్రద, పట్నవాసం పిల్లగా జయసుధ నటిస్తున్నారు ఒకనాటి హిట్ చిత్రాల జంట పి చంద్రశేఖరరెడ్డి ... శోభన్ మళ్లీ కలిసిన చిత్రం "నాయుడుబావ" వెనకటి విజయాన్ని చేకూర్చడం తధ్యము అని భావించ బడ్తాంది

### మంచిబాబాయ్ !

శ్రీ బాబుల్‌నాధ్ శ్రీ లక్ష్మణరావు అక్టోబర్ 14 న ప్రారంభించిన "మంచిబాబాయ్" వర్ణ చిత్రం, శోభన్‌బాబుకు ప్రతిష్టను తెచ్చిపెట్టే పాత్రను యిచ్చింది. శ్రీ టి కృష్ణ దర్శకత్వంలో రూపొందే ఈ చిత్రంలో జయచిత్ర, దీప నాయికలు

### డి వి ఎస్. రాజు కొత్త చిత్రం

మంచి చిత్రాల నిర్మాత శ్రీ డి. వి ఎస్ రాజు, అవార్డు చిత్రాల దర్శకుడు శ్రీ విశ్వనాథ్ దర్శకత్వంలో ప్రారంభించిన కొత్త చిత్రంలో శోభన్‌బాబు శృంగార నాయకుడుగా నటిస్తున్నారు ఆయనతో ఆడిపాడే అమ్మాయిగా జయసుధ నటిస్తున్నది "రొమాంటిక్ అండ్ యాక్షన్‌పాక్‌డ్ కథ"గా డి.వి ఎస్. రాజుగారి చిత్రాన్ని పేర్కొనాలి

[29 వ పేజీ చూడండి]



'అర్ధాంగి' లో.



# జి.వి.జి. పేజీ


'కరుణామయుడు'లో జగ్గయ్య

## పశ్చిమ జర్మనీకి తెలుగు చిత్రం

మ్యూనిక్‌లో జరిగే ఆడియో విజువల్ ఎక్స్‌పర్ట్స్ అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో ప్రదర్శనకు మన దేశంనించి రాధా చిత్రవారి ''కరుణామయుడు'' చిత్రం ఎన్నికైంది 16 ఎం ఎం లో పావుగంటకు కుదించిన ప్రింట్‌తో ఈ చిత్ర నిర్మాత, ప్రధాన పాత్రధారి విజయచందర్ పశ్చిమ జర్మనీకి వెళ్లనున్నారు

### సీతామాలక్ష్మి

చిత్తూరుకు 16 మైళ్ళ దూరంలో ఒక అందమైన పల్లె ఆ పల్లెకు తూర్పున ఒక టూరింగ్ టాకీస్ దాని పక్కనే ఒక చిన్నకొండ ఆ సినిమా థియేటర్‌లో పనిచేసే సీతాలు, కొండయ్య తరచు ఆ కొండపైన కలుసుకొని, తమ హృదయాలతో మాట్లాడుకునేవారు సీతాలును ముద్దుగా 'సీతామాలక్ష్మి' అని పిలుచుకుంటూ ఎంతో మురిసిపోయేవాడు కొండయ్య ఆమె గురించి ఏవేవో కలలు కనేవాడు ఆ కలలే నిజమైతే, ఆ అమాయకుల ప్రేమకు ప్రతిబంధకమౌతాయా ? ఇలా ప్రారంభమయ్యే ఒక వినూత్నమైన, విశిష్టమైన ఇతివృత్తాన్ని తమ తొలిచిత్రం ''సీతామాలక్ష్మి''కి ఎన్నుకున్నామని యువ చిత్రవారు పై లొకేషన్‌కు ఆహ్వానించిన పాత్రికేయులకు వివరించారు ఇటువంటి పకడ్బందీయైన కథ చేతిలో వుంటే డైరెక్టర్ కె విశ్వనాథ్ ఎంతగా విజృంభిస్తారో అందరికీ తెలుసు కాని, కొంతమందికి తెలియనిది ఈ చిత్ర నిర్మాత క్రాటగడ్డ మురారి గురించి ఇంటి పేరు బట్టి ఈ యువకుని పెద్దలకు చాలాకాలంగా సినిమా పంపిణీ శాఖతో సంబంధం వుందని యిట్టే ఊహించుకోవచ్చు మురారికి కూడా చాలాకాలంగా సినిమా రంగంతో సంబంధముంది కీ శే చక్రపాణిగారికి కార్యదర్శిగా వుంటూ చిత్ర నిర్మాణంలోని వివిధ శాఖలలోనూ, డైరెక్టర్లు వి మధుసూదనరావు, బాపు, సురేష్ సంస్థలో అసోసియేట్‌గా దర్శకత్వంలోనూ క్షుణ్ణంగా అనుభవం గడించారు విశ్వనాథ్‌కు కూడా అసోసియేట్‌గా పనిచేయాలనే కోరిక నెరవేరడానికి బదులు ఆయన దర్శకత్వంలో తను ఓ ఒక్కని చిత్రాన్ని నిర్మించాలనే ఆశయం కార్యరూపం దాల్చింది ''నువ్వు చిత్రం తీయబోయే సంస్థకు 'యువచిత్ర అని పేరు పెట్టు'' అని చక్రపాణిగారు ఏనాడో ఆశీస్సులు అందజేశారు కొంతవరకు మెడిసన్ కూడా మురారి చదివారు గనుక ప్రజల నాడి బాగా తెలిసి వుండాలి

ఇక ఈ చిత్రంలో నాయకుడు చంద్రమోహన్, నాయిక తాళ్ళూరి రామేశ్వరి పూనా ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌లో నటనలో శిక్షణ పొందిన చలాకీ యువతి ఈమె హీరోయిన్‌గా నటించిన రాజశ్రీ వారి హిందీ సినిమాస్కోప్ చిత్రమొకటి యిటీవలే విడుదలైంది మరికొన్ని హిందీ చిత్రాలలోనూ నటిస్తోంది ''సీతామాలక్ష్మి'' చిత్రంలో ఓ ముఖ్య పాత్రలో శ్రీధర్, టూరింగ్‌టాకీస్ ఓనర్‌గా అల్లు రామలింగయ్య, స్టేషన్ మాస్టర్‌గా వంకాయల సత్యనారాయణ, ఇతర పాత్రలలో ఈశ్వరరావు, జి ఎస్ ఆర్ మూర్తి, అంకినీడు ప్రసాద్, పి ఎల్ నారాయణ, విరల్‌ప్రసాద్, పల్లవి, జానకి, జయవిజయ, కృష్ణాజీ, సుధ పాల్గొంటున్నారు సమర్పణ క్రాటగడ్డ నరసింహం, బి ఇ మాటలు జంధ్యాల, గీతాలు దేవులపల్లి, వేటూరి సుందరరామ్మూర్తి, ఛాయ యు రాజగోపాల్, శిల్పం తోట, సంగీతం మహదేవన్, కూర్పు జి. జి కృష్ణారావు, సహకార దర్శకత్వం నండూరి విజయ్ పంపిణీదారులు లక్ష్మీ ఫిలిమ్స్

### అర్ధాంగి

అత్యంత ప్రేమానురాగాలతో వుండే ఆలుమగలు చెప్పుడు మాటలకు చెవి ఒగ్గి – వారి ఎండంటి కాపురం పాడయినప్పుడు, అచంచల దీక్షతో అనుమానించిన భర్తకు కనువిప్పు కలిగేలా ప్రవర్తించిన ఓ అర్ధాంగి ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి ''అర్ధాంగి'' అక్టోబర్ చివరి వారంలో విడుదల పి ఎ పి వారి ఈ రజతోత్సవ సంవత్సరంలో ఈ సంస్థ విడుదల చేసిన ''అత్తవారిల్లు'' చిత్రానికి ప్రత్యగాత్మ, రెండో చిత్రం ''ఆలుమగలు''కు ఆయన శిష్యుడు తాతినేని రామారావు, ఆయన శిష్యుడు ఎ మోహన్‌గాంధి మూడవ చిత్రం ''అర్ధాంగి''కి దర్శకత్వం వహించడం ఒక విశేషం మురళీమోహన్, జయసుధ, చంద్రమోహన్, నాగభూషణం, రాజబాబు, అల్లు రామలింగయ్య, మోహన్‌బాబు, జయభాస్కర్, వంకాయల సత్యనారాయణమూర్తి, రమాప్రభ, సూర్యకాంతం, జయమాలిని ''అర్ధాంగి''లో పాల్గొన్నారు కథ, స్క్రీన్‌ప్లే కె ప్రత్యగాత్మ, మాటలు సత్యానంద్, గీతాలు సి నారాయణరెడ్డి, వేటూరి, కొసరాజు, శ్రీశ్రీ సంగీతం టి చలపతిరావు, ఛాయ పి ఎస్ సుందరం, సహకార దర్శకత్వం ఎ డిమిట్రావ్, సహాయ దర్శకుడు టి సుధాకరరెడ్డి, శిల్పం జి వి సుబ్బారావు, కూర్పు జె కృష్ణస్వామి, నిర్వహణ ఎ పూర్ణచంద్రరావు, నిర్మాత అనుమోలు వెంకట సుబ్బారావు

### నలభై ఏళ్ళ క్రితం తీసిన చిత్ర ప్రదర్శన

హరిజనాభ్యుదయానికి సేవ చేసిన దేశోద్ధారక కీ శే కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికి అంకితం చెయబడిన స్వర్గీయ గూడవల్లి రామబ్రహ్మంగారి ''మాలపిల్ల'' చిత్రం అక్టోబర్ 9 ఉదయం మద్రాసు ఫిలిమ్ ఛేంబర్ థియేటర్‌లో ప్రదర్శింపబడింది ఈ చిత్రం నాయిక కాంచనమాలను 'జైహింద్' సత్యం కూతురు శ్రీమతి జయంతి పుష్పమాలను అలంకరించగా, కోడలు శ్రీమతి సుధ దుశ్శాలువతో సత్కరించారు నాయకుడు జి ఆర్ రావ్‌ను జైహింద్ సత్యం సత్కరించారు గూడవల్లి రామబ్రహ్మంగారి నిలువెత్తు కాంశ్య విగ్రహం విజయవాడలో ప్రతిష్ఠింపచేసే సంఘానికి వై రామకృష్ణప్రసాద్ అధ్యక్షులు, టి వి ఎస్ చలపతిరావు, జి కాశరాజు ఉపాధ్యక్షులు ఇంటూరి వెంకటేశ్వరరావు కార్యదర్శి జైహింద్ సత్యం కోశాధికారి అక్టోబర్ 9 సాయంత్రం హీరో శోభన్‌బాబు రూ 1,001 విరాళంతో ప్రారంభింపబడిన ఈ నిధికి తెనాలి గూడవల్లి రామబ్రహ్మంగారి కాంశ్య విగ్రహ ప్రతిష్ఠాపన సమితి రెండు వేల రూపాయలకు డ్రాఫ్ట్ పంపింది

### నటి 17వ జన్మదినోత్సవం

నట కవిత సెప్టెంబర్ 19న మద్రాసు న్యూ వుడ్‌లాండ్స్‌లో తన 17వ పుట్టిన రోజు పండుగ జరుపుకుంది ముఖ్య అతిధిగా విచ్చేసిన డైరెక్టర్ శ్రీధర్‌తోపాటు పాత్రికేయులు ఆమెకు శుభాకాంక్షలు అందజేశారు

# సినిమా

[27 వ పేజీ తరువాయి]



'పంతులమ్మ'లో శరత్‌బాబు, దీప

**కృష్ణ!**

పద్మాలయా పిక్చర్స్ ఊటీలో ప్రారంభించిన "పట్నవాసం" వర్ణ చిత్రం, వాహినీలో జరుగుతున్న యిన్‌డోర్ షెడ్యూల్సుతో పూర్తవుతుంది శ్రీ హనుమంతరావు నిర్మించే జనరంజకమైన యీ చిత్రానికి పి చంద్రశేఖరరెడ్డి దర్శకుడు ప్రేక్షకులు ఆశించే పాత్రను కృష్ణపోషించ, విజయనిర్మల, లక్ష్మి నాయికలుగా నటిస్తున్నారు

**సంఘం చెక్కిన శిల్పాలు**

"డేరింగ్ లేడీ" విజయనిర్మల దర్శకత్వంలో ప్రారంభమయ్యే రంగుల చిత్రం "సంఘం చెక్కిన శిల్పాలు" కృష్ణకు కొత్తతరహా పాత్రను ఇచ్చింది విజయనిర్మల నాయిక

**త్రిమూర్తి ప్రొడక్షన్స్!**

కృష్ణగారిని తమ పర్మనెంట్ కథానాయకుడు అని చెప్పడమేగాక, ఆచరణలో పెడుతున్న త్రిమూర్తి అధినేతలు శ్రీ బొబ్బి సాంబశివరావు జనవరిలో ప్రారంభించే యాక్షన్ థ్రిల్లర్‌కు,



'మనుషులు చేసిన దొంగలు'లో
కృష్ణ, కృష్ణంరాజు

నాయకుడుగా కృష్ణను, దర్శకుడుగా దాసును, నాయికగా జయప్రదను ఎంపిక చేశారు

"దొంగలకు దొంగ" వర్ణ చిత్రం మూరురోజుల చిత్రం అవుతుంది అని ప్రేక్షకులు అంటున్నారు

**కృష్ణ ... లాల్ చిత్రం!**

"నా పేరే భగవాన్" వర్ణ చిత్రాన్ని నిర్మించిన సంస్థ, తలపెట్టిన భారీ చిత్రంలో కృష్ణ నాయకుడుగా నటించగలరని, ఎస్ డి లాల్ దర్శకత్వం నిర్వహించగలరని తెలుస్తోంది

**అల్లరిబుల్లోడు**

మారుతీ కంబైన్స్ నిర్మిస్తున్న రంగుల చిత్రం "అల్లరిబుల్లోడు" కృష్ణ ప్రేక్షకులను విశేషంగా ఆకట్టుకునే కథను గొనియుంది "స్వప్నసుందరి" జయప్రద ముఖ్య నటిగా నటిస్తున్న యీ రంగుల చిత్రాన్ని గోపాలకృష్ణ నిర్మిస్తున్నారు జి సి శేఖర్ దర్శకుడు

**నవతకు నాయకుడు**

దర్శక నిర్మాత శ్రీ మల్లికార్జునరావు నవంబర్‌లో ప్రారంభించే కొత్తతరహా చిత్రంలో కృష్ణ థ్రిల్లింగ్ పాత్రను పోషించగలరని తెలిసింది అగ్రశ్రేణి నటీనటులు పాల్గొనే యీ వర్ణ చిత్రానికి మల్లికార్జునరావు దర్శక కథకుడు

పైన చెప్పినవిగాక, త్రిలోక్‌చందర్ దర్శకత్వంలో ప్రసన్నలక్ష్మి పిక్చర్స్ వారి చిత్రం, భాస్కర్ దర్శకత్వంలో "చల్ మోహనరంగ" చిత్రం ... కృష్ణ నటిస్తున్న చిత్రాలు

కథలో వైవిధ్యం వుండి, తను ధరించే పాత్రలో వెరైటీ వున్నప్పుడే ... ఆ చిత్రాన్ని అంగీకరించే పద్ధతిని కృష్ణ అవలంభిస్తున్నారు గనక ఆయన చిత్రాలకు అపజయం వుండదు.



★ ★ ★ ★ 'మల్లెపువ్వు'లో శోభన్, లక్ష్మి ★ ★ ★ ★

# టూకీగా టాకీ న్యూస్

★ ఎస్. పి. టి. ఫిలివ్స్ సినిమాస్కోప్ వర్ణ చిత్రంగా "అమ్మాయి" చిత్రాన్ని అక్టోబర్ 23 న రాజమండ్రిలో ప్రారంభిస్తున్నారు.

"స్వప్నసుందరి" జయప్రద అమ్మాయిగా నటిస్తున్న ఈ చిత్రంలో రంగనాథ్ నాయకుడుగా, రావుగోపాలరావు, కృష్ణకుమారి, రజనీకాంత్, పద్మప్రియ, కాంతారావు, మాడా, జగ్గారావు, నిర్మల, గిరిజ సహాయ నటులుగా పాత్రపోషణ చేస్తున్నారు.

"పుట్టినిల్లు...మెట్టినిల్లు" చిత్ర దర్శకుడు శ్రీ పట్టును, "అమ్మాయి" చిత్రానికి దర్శకుడుగా ఎంపిక చేసినట్లు, నిర్మాత శ్రీ ఎస్. పి. తమిళరసు తెలిపారు.

★ "పొరుగింటి పుల్లకూర" చిత్రాన్ని నిర్మించడంలో తోడ్పాటు నొసగిన శ్రీ ఏ. హనుమంతరావు ఒక కేరళ చిత్రాన్ని తెలుగులో నిర్మించడానికి నిర్ణయించారు. శ్రీ వి. మధుసూదనరావు దర్శకుడు.

★ అక్టోబర్ అయిదో తేదీ జరిగిన షూటింగుతో, లక్ష్మి ఫిలివ్స్ కంబైన్స్ వారి వర్ణ చిత్రం షూటింగు పూర్తయింది.

అనురాధాదేవి నిర్మించిన ఈ చిత్రానికి ఎస్ డి లాల్ దర్శకుడు "నా ప్రాణంలో ప్రాణం" అనేది పేరును మార్చనున్నట్లు తెలిసింది.

★ భానోదయా ఫిలింస్ ఒక ప్రబోధాత్మక చిత్రాన్ని కొత్త నటీనటులతో నిర్మించనున్నట్లు వార్త. శ్రీ దాసరి అన్నీ సమకూర్చే ఈ చిత్రానికి కె. శివలింగేశ్వరరావు నిర్మాత.

★ నిర్మాత రంజిత్‌కుమార్‌గారు నిర్మించనున్న కొత్త చిత్రానికి ఈరంకి శర్మ దర్శకులని తెలిసింది.

★ భరణీ పిక్చర్స్ త్వరలో నిర్మించనున్న శ్రీ ఎన్టీఆర్ చిత్రాన్ని, రామకృష్ణారావుగారు డైరెక్టు చెయ్యడం గమనార్హం.

★ జయలక్ష్మి మూవీస్ నిర్మిస్తున్న భారీ వర్ణ చిత్రానికి "రాజపుత్ర రహస్యం" అని పేరు పెట్టారు. శ్రీ సి. ఎస్. రాజు సారథ్యం వహిస్తున్న ఈ భారీ జానపద చిత్రానికి ఎస్. డి. లాల్ దర్శకుడు. శ్రీ యార్లగడ్డ నాయుడమ్మ సమర్పిస్తున్న యీ చిత్రంలో ఎన్టీఆర్ ... జయప్రద ప్రధాన జంటగా నటిస్తున్నారు.

★ విజయ మాధవీ పిక్చర్స్ శ్రీ దాసరి దర్శకత్వంలో ప్రారంభించనున్న వర్ణ చిత్రానికి "కటకటాల రుద్రయ్య" అని పేరిడినట్లు తెలిసింది. ఈ చిత్రంలో కృష్ణ ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణ కాగలదు.

—శ్రీనివాస్ ★




అది నెల్లూరు నుండి మద్రాసుకు వెళ్లే ఎక్స్‌ప్రెస్ ఆర్. టి. సి. బస్సు. నేను అందులో కండక్టరుగా పని చేస్తున్నాను. అది నెల్లూరు, వదిలితే, గూడూరు, నాయుడుపేట, సూళ్ళూరుపేట, ఆరంబాకం తప్ప మరెక్కడా ఆగదు. ప్రయాణం త్వరిత గతిన సాగుతుందని చాలామంది ఆ బస్సునే ఎక్కుతారు.

బస్సు స్టాండు వదిలి బయటి కొస్తూండగా హడావుడిగా ఒక అరవై ఏళ్ళ వ్యక్తి వచ్చి ఎక్కాడు. ఆయనకు నా ప్రక్కన వున్న సీటు యిచ్చాను. సెక్షన్ దాటేలోపల టికెట్లు యిచ్చేయాలన్న ఆదుర్దాలో ప్రయాణీకుల గమ్యస్థానాల నడిగి, టికెట్ పంచింగ్ చేసి యిచ్చి, డబ్బులు వసూలు చేసుకుంటున్నాను. తర్వాత నా ప్రక్కన కూర్చున్న ముసలాయన్నడిగాను. ఆయన మద్రాసు వెళ్లాలన్నాడు. టిక్కెట్టు తీసి ఆయన చేతిలో పెడుతూ ఆయనకేసి చూచాను. ఆయన నన్నే పరీక్షగా చూస్తున్నాడు.

''మీరు... రాఘవయ్య మాస్టారు కదూ ?'' ఆయన్ను అడిగాను.

''అవునోయ్. నిన్ను ఎక్కడో చూచినట్లుంది.'' అన్నాడాయన నన్ను జ్ఞప్తికి తెచ్చుకోడానికి ప్రయత్నిస్తూ.

''1958లో నేను చెన్నపల్లిపాలెం హైస్కూలులో ఫోర్తు ఫారంలో మీ విద్యార్థిని.'' అని నన్ను నేను పరిచయం చేసుకున్నాను.

''అవునోయ్. ఇప్పుడు జ్ఞాపకానికొస్తూంది. నీ పేరు గిరిధర్ కదూ ?''

''అవును సార్ !'' అన్నాను వినమ్రతగా.

''బాగున్నావా ? పెళ్లి... పిల్లలు...?'' అడిగారాయన.

''అన్నీ జరిగిపోయాయి మాస్టారు.'' అని వివరాలు చెప్పాను.

బస్సు నెల్లూరు టౌన్ దాటి వేగాన్ని పుంజుకుంది. నేను చార్టు ఫిలప్ చేసుకోవడం ప్రారంభించాను రాఘవయ్య మాస్టారు చేతిలో వున్న ఏదో పుస్తకం చదువుకుంటున్నారు.

చార్టు పని పూర్తయింది. ఇక యిరవై మైళ్లలో వున్న గూడూరు చేరేవరకూ నాకు పని లేదు. రాఘవయ్య మాష్టర్ని చూడగనే నాకు నా చదువుకున్న రోజులు జ్ఞప్తికొచ్చాయి.

రాఘవయ్య మాస్టారంటే చండశాసనుడని పేరు. ఆయన తెలుగు పండితుడు. ఆయన పాఠాలు చెప్తూంటే పిల్లలంతా శిలాప్రతిమలైపోయి వినేవాళ్ళు. ఆయన పిల్లలచేత క్రమ శిక్షణ పాటింపచేయడంలో గూడా దిట్ట. పిలక జుట్టు, రెండు కళ్ల సందున కుంకుమబొట్టు. నుదురున వీభూదివచ్చెలు, మెడలో రుద్రాక్షరమాల గల రాఘవయ్య మాస్టారుని చూస్తే ఆయన తెలుగు పండితుడని ఎవరైనా ఇట్టే పసిగట్టేయగలరు.

ఆరోజు ఆయన బమ్మెరపోతన విరచిత భాగవతంలోని ఒక అంశమైన ''మాతృహృదయం'' అనే పద్యభాగాన్ని చెప్తున్నాడు. పిల్లలంతా శ్రద్ధగా వింటున్నారు. నాకు వున్నట్లుండి పాస్‌కు పోవలసి వచ్చింది. లేచి అడగాలంటే భయంగా వుంది. పాఠం చెప్తూంటే మధ్యలో భంగం కలిగించాననుకుంటాడేమో ? అయినా అది అత్యవసర పరిస్థితి గనుక పైకి లేచి నిలబడ్డాను.

''ఏరా గిరీ ?'' పాఠం చెప్పడం నిలిపి, కళ్లద్దాల నుండి నాకేసి చూస్తూ అడిగారు మాస్టారు.

కుడి చేతికున్న అన్ని వేళ్లను మడిచి, చూపుడువేలు మాత్రం సగం వంచి చూపించాను.

''అవన్నీ దొంగవేషాలు. బయట ఐస్ గంట వినిపించిందిగా ? అది కొనడానికేసిన ఎత్తు నాకు పని చెరుపుచేయక కూర్చో.'' అని కసురుకున్నారు మాస్టారు.

నాకు దాదాపు ఏడుపొచ్చినంత పనైంది. ఆయన కెలా నచ్చచెప్పాలో నాకు తెలియలేదు. దిగాలు ముఖమేసుకొని నా స్థానంలో కూర్చున్నాను. ఒకవైపు పొట్ట ఉబ్బిపోతోంది. ఎప్పుడెప్పుడు ఆ పీరియడ్ అయిపోతుందా అని ఎదురు చూస్తున్నాను.

మాస్టారు చెప్పే పాఠం నా చెవుల కెక్కడంలేదు. ఇంకా ఇరవై నిమిషాలకుగానీ పిరియడ్ పూర్తికాదు. అంతవరకూ ఆపుకొనడం కష్టమనిపించింది.

మళ్లీ పైకి లేచి నిలబడ్డాను.

''ఏరా ?'' అన్నారు మళ్లీ.

మళ్లీ వేలు చూపించాను.

''నీకు కాదూ చెప్పేది ?'' అన్నారు.

అవసరం అడిగిస్తుందన్నట్లు

''నా బాధ మీకేం తెలుసు సార్ !'' అన్నాను ఉక్రోషంగా.

పిల్లలంతా ఫక్కుమని నవ్వేశారు.

''అంతా కొంటెకోణంగులు. మీకు చదువేం అబ్బుతుంది. పో... ఏడ్చిరా ?'' అన్నారు మాస్టారు విసుగ్గా.

''అవును సార్! ఇలాంటి అవసరం మీకొచ్చినప్పుడు చెప్తానుండండి.'' అన్నాను రోషంగా.

ఈసారి మాస్టారు నవ్వాయి.

''అదేంటిరా నాకలాంటి అవసరం వస్తే మాత్రం నీతో చెబుతానా ?'' అన్నారాయన.

''ఏమోలే మాస్టారు !'' అంటూ బయటకు పరుగెత్తాను.

తిరిగొచ్చిన తర్వాత న్యాకెంతో వూరట కలిగింది. శరీరం నుండి పెద్ద బాధ తొలగిపోయినట్లు రిలీఫ్ పొందాను.

మాస్టారు పాఠం చెప్పడం అయిపోయింది. పిరియడ్ ఇంకా అయిదు నిమిషాలుంది. ఆ టైమ్ గడపడానికి ఆయన మాటల్లోకి దిగారు.

''ఏరా గిరీ నేను పాస్‌కు పోవాలని నీతో చెప్పాల్సివస్తుందంటావా ?'' అని అడిగారు నవ్వుతూ.

''లేదులే మాస్టారు. అప్పుడున్న బాధలో అలా అనేశాను. క్షమించండి'' అన్నాను, సిగ్గుపడుతూ.

''పర్వాలేదులేవోయ్.'' అన్నారాయన నవ్వేస్తూ.

పిరియడ్ పూర్తయింది. మాస్టారు వెళ్లిపోయారు.

ఆ సంఘటనను నేను నెమరు వేసుకుంటూండగా బస్సు గూడూరు చేరింది. స్టాండులో ప్యాసింజర్లు కొందరు దిగారు, మరికొంద రెక్కారు. బస్సు తిరిగి బయలుదేరింది. టికెట్లు యిచ్చి డబ్బులు వసూలు చేసుకొని వచ్చి మాస్టారు ప్రక్కన కూర్చున్నాను.

''మాస్టారు ! యిప్పుడెక్కడుంటున్నారు ?'' అడిగాను నేను.

''మా పెద్దవాడు మద్రాసులో అమృతాంజనం కంపెనీలో పని చేస్తున్నాడు. వాడిదగ్గర వుంటున్నానోయ్ ! రిటైరై నాలుగేళ్లైంది'' జవాబిచ్చారాయన.

తర్వాత ఏం ప్రశ్న వెయ్యాలో నాకు తోచలేదు.

ఎ. ఎల్ ఎస్ — ఉల్లాస్ నగరు

సినిమాలో హీరోయిన్ ఏ చిన్న పని చేసినా అంతా అపుర్వూపంగా మెచ్చుకుంటారు నిజ జీవితంలో ఎన్ని సుగుణాలున్నా హృదయపూర్వకంగా మెచ్చుకోరేం ?

★ అది నటన ఇది జీవితం వాస్తవ జీవితంలో పోటీ, అసూయా ద్వేషం — వీటిని అధిగమించి మనిషి ప్రవర్తించడానికి — చాలా యెత్తుకు యెదగాలి నటనకా బాధ లేదు హీరోయిన్ డబ్బు పుచ్చుకు నటిస్తుంది చుట్టూ వున్నవాళ్ళూ, డబ్బు పుచ్చుకు — నటిస్తారు! సినీమాలో జీవితం ముచ్చిరేకు. అవసరానికి మెరుపుకోసం వాడడానికేగాని, శాశ్వతంగా నిలచే బంగారం కాదు.

ఎల్ వి ఎస్ — గూడూరు

ఒక మగవాడు ఎంతమంది ఆడవాళ్లతోనైనా తిరగవచ్చు అదే ఒక ఆడది తిరిగితే యెందుకలా యీసడించుకుంటారు ?

★ ప్రకృతి ఆడదాని మీద బాధ్యతలు పెట్టింది కనుక

ఎస్ ఎస్ జి. — సదాశివపేట

ఆడది అబలకాదు సబలకదా! మరి స్త్రీ జీవితాన్ని అరిటాకుతోను అద్దంతోను పోల్చుతారెందుకు ?

★ ఆ వంకని వదుల్చుకోడం సులభం కనుక అటువంటి ఉపమానాలనే వాడుతారు!

సి హెచ్ బి ఆర్ — సికిందరాబాదు

ఆడవాళ్లు అసలు వినిపించుకోరు.

★ పొరపాటు రావుగారూ, వినడం ఏ చెడ్డైనా చేసే పనే కాని వినిపించుకోడం ఓ కళ అది ఆడదానికి తెలిసినట్టు ఏ మగవాడికీ తెలియదు! మీరేం చెప్తున్నా తను వినదల్చుకున్నవే వినగల నేర్పు ఆడువారిది.

ఎస్ ఎల్ — అంగలూరు

ఆంధ్ర తమిళ ప్రజానీకంచే ఆదర్శభావాలు గల వనితగా పిలుచుకోబడుతున్న మీరు ఆశకు సంకెళ్లు నవలను ఏ ఉద్దేశ్యంతో రాశారు ?

★ ఆడదీ సంఘంలో — యెలా వున్నా తప్పుపట్టక మానడంలేదు చదువుకొంటే — యెక్కువ చదివిందని చదవకపోతే చదవలేదని, ఉద్యోగం చేస్తే స్వతంత్రం ప్రకటించిందని ఏదో ఒంకపెట్టక మానరు అలాంటప్పుడు — జాగ్రత్తగా వున్నవాళ్లకే మాటలుపడక తప్పదే — యిక కాంతిలా నమ్మి మోసపోయినదానికి ఏం సానుభూతి చూపిస్తారు! గొడ్డు గోతిలో పడితే — తలో రాయీ విసిరే అనాగరిక మూక ముందు నిస్సహాయంగా బలి అయిపోవడమో, మొండిగా బ్రతకడమో అలవాటు చేసుకోక తప్పదు ఆడపిల్లలకి ఆడదాని పొరపాటు ఆకాశమంత మగవాని పొరపాటు — ఆవగింజంతే! అన్నట్టు చూసే ఈ సంఘంలో ముగ్గురమ్మాయిలూ, వారి తమ్ముడూ - ఆదర్శాల శిఖరాన నిలబడి మెట్టు మెట్టుగా తన ప్రమేయం లేకుండానే కిందికి దిగజారిన తండ్రీ — వీరికోసం — ఆ కథ అల్లాను అంతా చదివి 'అయితే ఆడది చదువుకోనక్కర లేదనా మీ ఉద్దేశ్యం' — అంటే నేనేం చెప్పకలను ?!

కబీరు — అనంతపురం

స్త్రీ స్వాతంత్ర్యం అంటే స్త్రీ పురుషునితో పోటీచేయడం కాదు

★ మరి ?! గుర్తించేదాకా దారి పక్కన వేచివుండడమా ? స్త్రీలు పోటీకి దిగుతున్నారని మీరనుకుంటున్నారు న్యాయమైన స్థానంలో నిలబడ్డానికి తాపత్రయపడుతున్నామని మేం అనుకుంటున్నాం వ్యక్తిత్వాల సంఘర్షణ తప్పదు.. భయపడి యెవరి దారిన వారు నడిస్తే — ఇది సమాజమెలా అవుతుంది ?!

ఎస్ ఆర్ జి — గుంటూరు

ప్రశ్నావళి శుద్ధదండుగ ఆవిడ యెంత మొత్తుకున్నా ఎవ్వరూ మారరు సిఫార్సులతోనూ, సలహాలతోనూ జీవితాలు బాగుపడవు కాపురాలు చక్కపడవు

★ పోనీ శాసనాలవల్లా, వినాదాలతో చెవులు గింగుర్లెత్తించడంవల్లా, కళ్లు మూసుకుని అంతా బాగానేవుంది అనుకోడంవల్లా — బాగుపడే ఆశ వుందంటారా ?! చెవి నిల్లు కట్టుకు పోరగా పోరగా, నస పెట్టగా పెట్టగానైనా కాస్త అప్పుడప్పుడు జ్ఞాపకం రావడం, ఆలోచనలు తలెత్తడం జరుగుతూ వుంటుంది ఆలోచన మార్పుకి నాంది కదా ?

బి వి పి — విజయవాడ

ఆడవాళ్లు ఉట్టినే భయపడతారెందుకు ? మగవాళ్లు అంతా చెడ్డవాళ్లనా ?

★ కాదు భయం రక్షణకు దారి అది భయం వుంటే కాస్త జాగ్రత్తగా వుంటాంకదా ?!

---

"ఎవ్వెంతవరకూ చదివావ్ ?" అడిగారాయన

"ఎస్సెల్సీ పాసయ్యాను అతి కష్టంమీద ఈ ఉద్యోగం సంపాయించగలిగాను ఇందులో చేరి మూడేళ్లైంది" నేను వరుసగా చెప్పాను

"జీతం ఎంత వస్తుంది ?" అడిగారు.

"మూడొందలు సార్!" అన్నాను నేను

తర్వాత స్టేజీ నాయుడుపేట

నాయుడుపేటకు ఆరు మైళ్లివతల "పండ్లూరుగేట"ని ఒక రైల్వే లెవల్ క్రాసింగ్ వుంది

"పండ్లూరు గేటు - వేసివుంటుందా ?" వున్నట్లుండి అడిగారు మాస్టారు

"ఏమో సార్! యిప్పుడు హౌరా ఎక్స్‌ప్రెస్‌కు టైమ్ వేస్తే వేసివుండవచ్చు" అన్నాను

"వేసివుంటే బాగుణ్ణు" గొణుక్కున్నట్లుగ అన్నారు మాస్టారు నాకు కాస్త ఆశ్చర్యమే కలిగింది ఏమంటే రైలు గేటు వెయ్యకుండా వుంటే ప్రయాణం త్వరగా సాగుతుందని ఎవరైనా ఆశిస్తారు.

"ఏం మాస్టారు ?" అన్నాను నేను.

"ఏం లేదులే" అంటూ పుస్తకంలో తల

# చిన్న సాయం

దూర్చారు మాటలలోనే పండ్లూరు గేటు వచ్చింది గేటు తీసేవుంది బస్సు రైల్వే లైను దాటేసింది మాస్టారు ముఖంలో నిరాశాచ్ఛాయలు కనిపించాయి

"నాయుడుపేట చేరేందుకిక ఎంతసేపు పడుతుంది ?" మాస్టారు అడిగారు

"ఇంకో పది నిమిషాల లోపలే"

"అక్కడ ఎంతసేపాగుతారు ?"

"ఎక్కువసేపు ఆగేదిలేదు ఇది ఎక్స్‌ప్రెస్ సర్వీసు ప్రయాణీకులు దిగడం ఎక్కడమే ఆలస్యం" జవాబిచ్చాను నేను

మాస్టారుకు మళ్లీ ఏదో నిరాశ కలిగింది

బస్సు నాయుడుపేట స్టాండులో ఆగింది

ప్యాసింజర్లు కొంతమంది దిగారు, మరి కొంతమంది ఎక్కారు నేను రైట్ చెప్పబోతున్నాను,

"గిరీ! చిన్న సాయం చేసిపెడతావా ?" అడిగారు సంకోచంగా

"చెప్పండి మాస్టారు!"

మా చిన్ననాటి ఉపాధ్యాయునికి చిన్న సాయం చేయడంకంటే మరేముంది ?

"రెండు నిమిషాలు బస్సు నిలుపు" అంటూ కుడిచేతి అయిదు వేళ్ళలో నాలుగు వేళ్ళు ముడిచి, చూపుడు వేలు సగం వంచి చూపించారు

"అలాగే సార్!" అని డ్రైవరువైపు తిరిగి "రామారావ్! కొంచెం ఇంజన్ ఆఫ్ చేసుకో" అని డ్రైవరుతో చెప్పాను

రామారావు ఇంజన్ ఆఫ్ చేశాడు

"వెళ్లిరండి" అన్నాను

మాస్టారు స్వర్గానికి దారి దొరికనంతగా సంతోషపడిపోతూ, బస్సు దిగి కాల్వగట్టువైపు పరుగెత్తారు

మాస్టారు త్వర త్వరగా తిరిగొచ్చారు

"రక్షించావ్! నెల్లూరు నుండి బిగబట్టుకొని వస్తున్నాను" అన్నారు మాస్టారు నింపాదిగ; సీట్లో కూర్చుంటూ

ఆ రోజు మాస్టారు "అదేంటిరా! నా కలాంటి అవసరం వస్తే మాత్రం నీతో చెబుతానా ?" అని ప్రశ్నించారు అది ఈరోజు కాకతాళీయంగా జరిగింది. ఆ విషయం మాస్టారుకు గుర్తు చేయడం యిష్టంలేక చేతనున్న పంచింగ్ మిషన్ బస్సు కమ్మికేసి టకటక కొట్టి బస్సు కదిలించమని ఆదేశమిచ్చాను బస్సు బయలుదేరింది

## ప్రశ్నావళి * ప్రశ్నావళి *

తెలివి యెలా పెరుగుతుంది ?

★ మన తెలివితక్కువతనం ఒప్పుకోవడంతో ప్రారంభం అవుతుంది — విజ్ఞానసముపార్జన.

మహావిప్లవం ప్రబోధించే మహామహా కవులూ రచయితలూ గట్టునే కూర్చుంటారేం ?

★ తెలివైనవాళ్ళు! తెలివైన ఈతగాడు యెప్పుడూ గంభీరమూ, అతి లోతూ అయిన సముద్రాన్ని పొగుడుతూనేవుంటాడు గాని గట్టు పట్టుకొనే వేలాడుతాడు. దిగితే లోతు అందదని తెలుసుకాబట్టి !

జె. ఎస్. డి. — సికింద్రాబాదు

నిజంగా మీరు నమ్మే దేవుడు వుంటే అందరి నోటికీ ఆహారం అందించాలి.

★ ఏ దేవుడైనా చేసేది అంతే! ఏ దారైనా — చీమని ఆహారం దగ్గరకి తీసుకు వెళ్లడం — మీరు గమనించలేదా !

—కె. రామలక్ష్మి



'ప్రయాణంలో పదనిసలు ...'

అరవబోయిన విజయ నోరుని గట్టిగా మూశాడు. టాక్సీ శరవేగంతో ముందుకు పోతోంది.

"నువ్వా చిన బావా ?" అంది ఆశ్చర్యంగా !

"ఉం... నేనే !..." విజయను పట్టుకున్న చేతిని అతికష్టంమీద వడిలోకి తీసుకున్నాడు.

విజయ బుగ్గలమీద తడి అంటుకోవటంతో చిరాకుగా పమిటి చెంగుతో తుడుచుకోబోయి నివ్వెరపోయింది. చేతినిండా జాకెట్టు బుజంమీదా ఎర్రటి రక్తం.

"ఏమిటిది శ్రీనివాస్ ?..."

సీటుకి ఆనుకుని సోలిపోయివున్న శ్రీనివాస్‌కి విజయ అడిగినది వినిపించలేదు. గాజుపెంకులేవో చేతిని చీరాయేమో ? అయినా రోడ్డుమీద గాజు పెంకులు ఎక్కడివి ? జేబురుమాలాతో ఎడమ చేతికి కట్టు కట్టుకున్నా రక్తం స్రవించటం ఆగటంలేదు. షర్టంతా రక్తమే! చూసేందుకు భయంకరం అనిపించింది విజయకి.

డ్రైవర్ సహాయంతో శ్రీనివాస్‌ని లోపలికి తీసుకొచ్చి సోఫాలో కూర్చోబెట్టి డ్రైవర్‌కి డబ్బులిచ్చి పంపేసింది.

"ఏమయింది ? ఏముయిందంటూ !" లోపలి నుంచి పరిగెత్తుకువచ్చింది పార్వతమ్మ.

"బావకి చాలా గాయాలు తగిలాయి అత్తయ్యా! ముందు డాక్టర్‌కి ఫోన్ చేసిరండి !" అంది విజయ కంగారుగా !

పార్వతమ్మ వెళ్లి డాక్టర్‌కి ఫోన్ చేసి వచ్చి కొడుకు దగ్గిర కూర్చుంది.

"అసలేం జరిగింది విజయా ?" అనడిగింది.

"ఆ సంగతి నన్నడిగేకంటే చినబావని అడగటమే మంచిదత్తయ్యా !"

"ఏరా ?... ఏంచేశావు ? ఎవరితోనన్నా తగూపడ్డావా ?"

## రాగబంధం

[25 వ పేజీ తరువాయి]

శ్రీనివాస్ తల అడ్డంగా తిప్పాడు.

"మరెందుకిలా జరిగింది ?"

"అవన్నీ నీ కెందుకమ్మా ? బైట తిరిగే మాకు ఎన్నో సమస్యలు ఎదురవుతాయి. వాటి పరిష్కార మార్గం కొరకు అన్వేషిస్తుంటే యిలాంటి గాయాలే తగులుతాయి !"

"నీవన్నీ అఘాయిత్యపు పనులేరా ? యిలా అయితే ఎట్లా శ్రీనూ ?"

పార్వతమ్మ కళ్లవెంట నీళ్ళు కారిపోతున్నవి. తల వంచుకుని నిర్జీవ ప్రతిమలాగా కూర్చున్నాడు. ఈ వార్త తెలిసిన వెంటనే నాయర్ మాలి పని మనిషితోపాటు సుందరి కూడా మేడ దిగి వచ్చింది. ఎందుకిలా జరిగిందని తెలుసుకోవాలనిపించలేదు. మరిది స్వభావం చాలా పొగరయినదని సుందరికి కూడా తెలుసు. పొగరు ఫలితమే అనుకుంది.

డాక్టర్ వచ్చేలోగ మెత్తటి గుడ్డతో రక్తమంతా తుడిచి కట్టిన జేబురుమాలా తీసేసి మంచి గుడ్డ కట్టింది. తన బట్టలనిండా రక్తం అయితే వెళ్లి మార్చుకుని వచ్చింది.

డాక్టర్ రావటం గాయాలకు మందు రాసి కట్టుకట్టి ఇంజక్షన్ చేశాడు. నిద్రకని టాబ్‌లెట్సు యిచ్చి రేపు వస్తానని చెప్పి వెళ్లిపోయాడు. నాయర్ కలిపి తెచ్చిన హార్లిక్సు త్రాగి తల్లి సహాయంతో నెమ్మదిగా మేడమీద తన గదిలోకి వెళ్లాడు. కొడుక్కి సహాయంగా వుంటానికి నాయర్‌ని గదిలో వుండమంటే ? వంటకి యిబ్బంది అవుతుంది. భాస్కర్‌కి ఆఫీసు ! తను మేడ మెట్లు నాలుగుసార్లు ఎక్కలేదు దిగలేదు. విజయనే చూస్తూవుండమంటే? వాళ్లిద్దరిమధ్యా పచ్చగడ్డివేస్తే భగ్గుమంటుంది. అయినా విజయకి చెప్పిచూస్తాను ! అనుకుంది పార్వతమ్మ.

జరిగిన సంగతి తను చూసినంతవరకూ స్పష్టంగా మేనత్తకి వివరించింది విజయ.

"వీడి ఆగడం మరీ మితిమీరిపోతున్నది. ఏం చెయ్యాలో అర్థంకావటంలేదు. ఆ గాయాలు యెప్పటికి మానను ? వీడు లేచి తిరిగేది ఎప్పుడు ?" బాధగా అంది పార్వతమ్మ.

"ఊహ తెలిసినప్పటినుంచీ తగిన పద్ధతిలో; మంచ క్రమశిక్షణలో వుంచినట్లయితే యిలాంటి దుడుకు పనులు చేసే అలవాటు వుండేదికాదేమో అత్తయ్యా ?" సాలోచనగా అంది విజయ.

"చెడిపొమ్మనమని ఏ తల్లీ బిడ్డను పాడుచెయ్యదు విజయా ? పోగా మిగిలింది చిన్నవాడు వీడేనన్న గారాబంచెయ్యటం తప్పంటావా ?"

"తప్పని అనటంలేదు అత్తయ్యా! తల్లికి బిడ్డమీద ప్రేమ వుండటం సహజం! ఆ ప్రేమ వాళ్ల భవిష్యత్తుని పాడుచేసేదిగా యెప్పటికీ వుండకూడదనే నా అభిప్రాయం! యెంత మంచివాళ్లనయినా స్నేహాలు; పరిసరాలు మనిషిని ఉన్మత్తుడుగా మార్చే అవకాశాలు ఎక్కువ! యిలాంటి ఉద్యమాలు చినబావ కెందుకు ? తను లేనిదే ఏమీ జరుగదా ? తనొక్కడే న్యాయానికి నిలబడి పోరాడితేనేగాని ఆ న్యాయానికి విలువ దక్కదా ? బస్సులో టికెట్టు తీసుకోమంటే తప్పు! టికెట్టు చేతిలోపెట్టి కండక్టర్ డబ్బు లడిగితే పెద్ద అపరాధం చేసినట్టు విద్యార్థులు ఫీలవ్వటం; తద్వారా మాటా మాటా పెరిగి చెయ్యి చేసుకోవటం; ఆ తర్వాత సమ్మెలు అంటూ బజార్లునపడి ప్రభుత్వ ఆస్తులను

ధ్వంసం చేయటం! అవన్నీ మనవికాదూ? ప్రభుత్వ ఆస్తులే మన ఆస్తులుగా పరిగణలోకి తీసుకున్నాడు ఇలాంటి సమస్యలు ఉత్పన్నం కావు! ప్రతీ చిన్న విషయానికీ నేనంటూ బైలుదేరే చినబావ చర్యని నేను ఆమోదించలే కున్నాను. మరీ యింత మొండివైఖరి తత్వమయితే కష్టం!''

''విజయా! నువ్వూ నన్నే అంటున్నావా?''

''అనద్దటే? ?... నాకు తెలియకుండా వాడు అడిగినంత డబ్బు యిచ్చి అడ్డగాడిదలాగా ఊరిమీద తిప్పావు!''

అంటూ అక్కడికి వచ్చిన రామనాథం అనేసరికి పార్వతమ్మ తల వంచుకుంది. విజయ సిగ్గుపడింది తనన్న మాటలు విన్నందుకు.

''వాడసలు కాలేజీకి వెళ్ళి చదువుతున్నాడో?



'మొరటోడు'లో జయసుధ

లేక రోడ్లు సర్వే చేస్తున్నాడో? నువ్వెప్పుడయినా తెలుసుకున్నావా? అడిగినంత డబ్బు యివ్వటమే గొప్ప అనుకున్నావు!''

రామనాథం అడుగుతుంటే పార్వతమ్మ కళ్ళనిండా నీళ్ళు నిండుకున్నాయి. శ్రీనివాస్ చేసే పనులకు తనెంతవరకు బాధ్యురాలన్నదే ఆమె ఆలోచన! అదీగాక భర్తకి కోపం వస్తే తిరిగి జవాబు చెప్పగలిగే ధైర్యం పార్వతమ్మకి లేదు. అలాంటి ధైర్యమే వున్నట్లయితే ఆ సంసారం అంత అణుకువగా సాగేదికాదసలు!

''ఆర్. టి. సి. బస్సు కండక్టర్ టిక్కెట్టు యిచ్చి డబ్బులు అడిగాడట. పరిమితికి మించి

# రాగబంధం

ఎక్కటానికి వీలులేదన్నాడట! మాలాంటి గొప్ప వాళ్ళని యిలా అవమానించుతాడా? అని వీళ్ళంతా రెచ్చిపోయారట. నిజానికి కండక్టర్ తప్పేమీ లేదని; మన అబ్బాయి కాబట్టి వదిలిపెట్టానని యస్. ఐ. నాకు ఫోన్ చేసి చెప్పాడు. మరోసారి యిలా జరిగితే అరెస్టు చెయ్యవలసి వస్తుందని కూడా చెప్పాడు. అలాంటిదేదన్నా జరిగితే నేనేమీ జోక్యం చేసుకోను!''

''చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకుని ప్రయోజనం లేదు మామయ్యా? ఎవరి తెలివి తక్కువ అన్నా కానివ్వండి! జరిగిపోయినదంతా పీడకలగా భావించండి. చినబావని యికనుంచయినా చెడు స్నేహాలకు దూరంగా వుంచండి!'' అంది విజయ.

''విన్నావటే? విన్నావటే? చిన్నపిల్లపాటి బుద్ధి జ్ఞానం వాడికి లేదే? నువ్వు నేర్పితేగా వుండేందుకు?''

''మీరు తొందర పడుతున్నారు మామయ్యా!'' అంది విజయ రామనాథం కోపంతో ఊగిపోతుంటే!

''తొందరకాక ఏమున్నదమ్మా! యస్. ఐ. ఫోన్ చేసి చెప్తుంటే ప్రాణం చచ్చిపోయింది. ఎలాగో అలా ఏడవండి!''

కోపంతో విసురుగా డ్రాయింగ్ రూంలోకి వెళ్ళిపోయాడు రామనాథం.

పార్వతమ్మ కళ్ళు తుడుచుకుంది. భర్తకి ఇంత కోపం రావటానికి కారణం తనేనేమో? ప్రశ్నించుకుంది పార్వతమ్మ.

''విజయా! శ్రీనుకి బాగా తగ్గేవరకూ వాడినొక కంట కనిపెడుతూవుండాలి. నేవా మేడ మెట్లు దిగలేను; ఎక్కలేను. ఈరోజు నుంచీ వాడి బాధ్యతంతా నీదే!'' అంది పార్వతమ్మ.

''అలాగే అత్తయ్యా! కాలేజీకి వారంరోజులు సెలవు పెడతాను!''

''ఆ సంగతి మీ మామయ్యకి తెలిస్తే అసలు ఊరుకోరు. కాలేజీకి వెళ్ళే ముందు; తిరిగి వచ్చిన తరువాత చూసుకుంటే చాలు!''

''తప్పకుండాను! బావ మరలా తిరిగితే అదే చాలు అత్తయ్యా! మామయ్య ఏదో అన్నారని మీరు బాధపడకూడదు. బావ మంచికోసమేగా చెప్పింది?''

''ఆఁ... ఏమి మంచో? ఏది చెడో? వాడి కిన్ని గాయాలు అయిన తరువాత చెప్పితేనేమి? చెప్పకపోతేనేమి?''

''బావ ఇలా చేస్తాడని మామయ్యకి మాత్రం ఏం తెలుసు అత్తయ్యా? మీరిలా బాధపడుతూ కూర్చుంటే లాభంలేదు. ఆలస్యంపట్టినా క్రమేపీ తగ్గుతుంది. నీ మనసుని నొప్పించినట్టున్నాను. బావని కావాలని అనటంలేదు నేను! భవిష్యత్తులో అపూర్వ విద్యాసంపన్నుడుగా పైకి రాలేక పోతున్నాడే అన్న బాధ! అంతే అత్తయ్యా!... అంతే!''

''నాయర్ మంచినీళ్ళు!''

మేడమీదనుంచే గట్టిగా పిలిచాడు శ్రీనివాస్.

''చూడమ్మా విజయా! నాయర్ వంట పనిలో వున్నాడనుకుంటాను. మంచినీళ్ళు తీసుకెళ్ళి ఇవ్వు!''

ట్రేలో మంచినీళ్ల గ్లాసు వుంచుకుని మేడమీద శ్రీనివాస్ గదిలోకి వెళ్ళి టీపాయ్‌మీద వుంచి గ్లాసుని అందివ్వబోయి చేతులకు కట్లు వుండటంతో త్రాగించబోయింది.

''నాకేమీ అక్కరలేదు! ఆ గ్లాసు అక్కడ పెట్టు!'' గర్జించాడు శ్రీనివాస్.

''ఎలా త్రాగుతావు చినబావా?''

''అది నీ కనవసరం!''

''... ... ...''

''నేనిక్కడ వంటరిగా బాధతో ఛస్తుంటే మీరందరూ అక్కడ మాట్లాడుకుంటూ కూర్చున్నారా?'' అసహనంగా ప్రశ్నించాడు.

''కూర్చుని మాట్లాడుకోవటంలేదు! నిలబడే మాట్లాడుకుంటున్నాం!''

''షటప్!''

''పాపం! వంటరిగా వుండేందుకు బాధపడుతున్నావనుకుంటాను! నీ గాంగ్ వున్నదిగా! తీసుకుతెచ్చుకోకూడదూ? తెల్లవార్లూ మాట్లాడుకోవచ్చు?''

''నీ బోడిసలహా నేనేమీ అడగలేదు!''

''ఉన్నమాటేగా అన్నది?'' ఏమాత్రం తొణక్కుండా జవాబిచ్చింది.

''ఏమిటా వున్న మాట? ... వాడు! ... వాడు! ఆ స్కౌండ్రల్! కాలిలేదు ఎక్కవద్దని అటకాయించుతాడా? వాడికెన్ని గుండెలు? మమ్మల్ని ఎదిరించి వాడు బ్రతకగలడా?'' పళ్ళు నూరుకున్నాడు.

''పరిమితికి మించి జనాన్ని యెక్కించితే కండక్టర్ ఉద్యోగం పోతుంది. భార్యాబిడ్డల గతి ఏమిటి? నీ మాటే నెగ్గాలనుకోవటం అవివేకం. ఇప్పుడు బాధపడేది యెవరూ చెప్పు? నువ్వేగా శ్రీనివాస్? ఈ గాయాలు తగ్గేది ఎప్పుడు? నువ్వు కాలేజీకి వెళ్ళేది యెప్పుడు?''

''చదివి ఉద్యోగంచేసి సంపాదించితేనేగాని జరుగదన్న భయం నాకు లేదు. నాలుగు తరాల వరకూ కూర్చుని తింటే సరిపడినంత ఆస్థి నాన్నగారు సంపాదించి వుంచారు!''

''మరి పెదబావ యెందుకు ఉద్యోగం చేస్తున్నట్టు? కూర్చుని తింటే జరుగదనా?''

''వాడొట్టి ఫూల్! కట్టుకున్న భార్యతో జల్సాచేయటం చేతగాక ఉద్యోగం అంటూ పగలస్తమానం ఆఫీసుకి అంటుకుపోతున్నాడు!''

''పెదబావ గురించి నువ్వు చేసిన అంచనా తప్పు! చాలా యోగ్యమయిన నిర్ణయం ఆయనది!''

శ్రీనివాస్ అపర్గళంగా మాట్లాడసాగాడు. ఆ మాటలు వినలేక క్రిందకి వచ్చేసింది విజయ.

[ఇంకా వుంది]

4–11–1977 శుక్రవారంమొదలు

10–11–1977 గురువారం వరకు

# వారఫలం

—మహేష్—

**మేషం:—** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో ఇతరుల నిమిత్తం మీరు శ్రమపొందవలసి వస్తుంది వృత్తిలోపాటివారిపోటీ పెరుగుతుంది స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి

**వృషభం:—** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ముందు లాభించ గల వ్యవహారాల్లో అభివృద్ధినిసాధిస్తారు, స్త్రీలకు— బంధుమిత్రులను కల్సుకొంటారు. విలాస వస్తువులు కొంటారు.

**మిథునం:—** వృత్తిలో పాటివారి పోటి తగ్గుతుంది రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి మిత్రులకు సహాయం చేస్తారు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ప్రయాణాలు వాయిదా పడతాయి. స్త్రీలకు :— ఆరోగ్యం బాగుంటుంది. పాటివారిలో గౌరవం లభించగలదు,

**కర్కాటకం:—** మీఆలోచనలుఫలిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు. స్త్రీలకు :— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం:—** వృత్తివ్యాపారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది మీ ప్రయత్నాలు ఫలించగలవు. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు.— ఆరోగ్యం బాగుంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**కన్య:—** ఫలితం లేని శ్రమ కలుగుతుంది. వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మటం తగదు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వ్యాపారంలో ఆదాయంపెరుగుతుంది స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో ప్రయాసకు గురి కాగలరు, వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల:—** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. సాహిత్య కళా రంగాల్లో మీ కృషి రాణిస్తుంది వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. అలంకార వస్తువులు కొంటారు.

**వృశ్చికం:—** ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. సజ్జనసాంగత్యం లభిస్తుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందగలదు స్త్రీలకు — పుణ్యకార్యాలు చేస్తారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి

**ధనుస్సు:-** ఆర్థికవ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు

**మకరం:—** సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వృత్తిలో శ్రమ కలుగుతుంది. ఆందోళనకు గురికాగలరు. వారం ఆఖరులో రావలసిన డబ్బు అందుతుంది విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం:—** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. చికాకులు యేర్పడతాయి. స్త్రీలకు :— ఆరోగ్యం బాగుండదు పాటివారిలో గౌరవం లభిస్తుంది

**మీనం:-** రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కల్గుతుంది. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. వృత్తిలో పాటివారిపోటీ పెరుగుతుంది. వారం ఆఖరులో ప్రయోగజనంగల పరిచయాలు యేర్పడతాయి మీ ఆలోచనలు ఫలిస్తాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరం కొసం వ్యయం చేస్తారు.

చోటే పోస్టింగ్ రావటం చాలా చాలా అదృష్టం. అందుకనే మన పార్టీ కూడా గ్రాండ్‌గా వుండాలి!''

వీళ్ల ధోరణి చూస్తుంటే నాకు బాగానే వదిలించేట్లున్నారు.

''ఏమంటావ్, ఆనందరావ్ ?''

''మీ యిష్టం ! స్వీట్, హాట్, కాఫీ కావాలా ?''

''అబ్బే ! షేమ్ ! షేమ్ ! అదేంపార్టీ! హైస్కూలు కుర్రాళ్లలా ?''

''పోనీ హోటల్ సత్కార్‌లో గ్రాండ్ డిన్నర్ యివ్వనా ?''

''నథింగ్ డూయింగ్ ! అదేంపని కాలేజీ కుర్రాళ్లలా ?''

''మరేం చేయమంటారు ?''

## కాక్ టెయిల్

(7 వ పేజీ తరువాయి)

''వుయ్ వాంట్ ఎ కాక్ టెయిల్ పార్టీ !'' ఏక కంఠంతో పల్కారందరూ.

ఉలిక్కిపడ్డాను

''నీకా భయం అక్కర్లేదు ! అందరం బార్లోకి వెళ్లి తాగుదాం !'' అన్నాడు సుబ్రావ్.

''నీకేం బ్రహ్మచారివి ! కొంపతీసి మనల్ని ఎవడైనా చూసి ఈ విషయం నా అత్తగారికి తెలియజేస్తే యింకేమైనా వుందా ? నేనెంతో బుద్ధిమంతుణ్ణని, తన ఆస్తినంతా తదనంతరం నాకే యివ్వాలను కొంటుంది మా అత్తగారు. ఐ డోంట్ వాంట్ టు లూజ్ యిట్ ఫర్ దిస్ పార్టీ!'' శర్మ గాబరాపడ్డాడు.

''ఈ విషయం నా భార్యకు తెలిస్తే పుట్టింటికి వెళ్లిపోతుంది గురూ ! అసలే ఆమెకు కోపం జాస్తి ! ఆమె రైలెక్కితే నాకు భోజనం నాస్తి!'' సన్నగా గొణిగాడు గుర్నాథం

''ఈ విషయం మా నాన్నకు తెలిస్తే రెండు చెంపలూ వాయిస్తాడు !'' అన్నాడు యూనియన్ లీడర్ రామ్మూర్తి.

''మరి ఈ సమస్యకు పరిష్కారమేలాగ?'' సుబ్రావ్ అన్నాడు.

''నేను చెప్తాను!'' అన్నాడు గుర్నాథం.

''ఏమిటి ?'' అందరూ ఉత్సాహంగా అడిగారు.

"మన సుబ్రావ్ బ్రహ్మచారేగా! వాడి రూమ్‌లో అరేంజ్ చేద్దాం'" పక్కలో బాంబు పడ్డట్లయింది సుబ్రావ్‌కు.

"వెరీ వెరీ డేంజర్! అంత పని మాత్రం చేయకండి! మా యింటి వోనర్‌కు వో అందమైన కూతురుంది. ఇప్పుడే ప్రేమాయణం మొదలెట్టాను. ఆ అమ్మాయి దృష్టిలో నన్నొక త్రాగుబోతునిచేసి మా ప్రేమ చెడగొట్టకండి!" చేతులెత్తి నమస్కరించాడు సుబ్రావ్.

"మరయితే ఎక్కడ అరేంజ్‌చేద్దాం?" అన్నాడు శర్మ.

"పోనీ ఎవరింట్లోనైనా అరేంజ్ చేస్తే!" గుర్నాథం సలహా.

"అబ్బే బాగుండదు గురూ! కాక్

టెయిల్ పార్టీ చేసుకొని తెల్లవార్లు చతుర్ముఖ పారాయణం చేయాల్సి వుంటుందిగా! ఇళ్లల్లో బాగుండదు!" రామూర్తి తీర్పు.

"పోనీ ఈ పార్టీని ఆనందరావ్ యింట్లోనే అరేంజ్ చేస్తే ఎలా వుంటుంది?" కళ్లజోడు తీస్తూ అన్నాడు శర్మ.

మిన్ను విరిగి మీద పడ్డట్లయింది.

"ఇళ్లల్లో పెట్టడం భావ్యంకాదని మీరే అన్నారుగా!" తప్పించుకోటానికి ప్రయత్నించాను.

"అవును! ఆ నిబంధన అద్దెకొంపల విషయంలో మీది స్వంత యిల్లేగా!"

"అయినాసరే మా అన్నపూర్ణ ఒప్పుకోదు!"

"ఏముంది బ్రదర్! ప్రమోషన్‌వచ్చిన సందర్భంలో ఫ్రండ్సు పార్టీ కావాలంటున్నారంటే వదినగారు మాత్రం కాదంటారా?" సుబ్బాబ్ అన్నాడు.

"ఇలాంటి పిచ్చి పిచ్చి వేషాలు వేస్తే మా అన్నపూర్ణకూడా గుర్నాథం మిసెస్‌లా పుట్టింటికి వెళ్లిపోతుంది."

"ఊ! మరీ మంచిది! మనమంతా ఎంచక్కా ఫంక్షన్ సెలెబ్రేట్ చేసుకోవచ్చు!" అన్నాడు రామ్మూర్తి.

"ఏడ్చినట్లుంది తెలివి!" అన్నాను నవ్వుతూ.

సుబ్బాబ్ రెరడు క్షణాలపాటు పైన తిరుగుతున్న సీలింగ్ ఫాన్ వైపు చూస్తూ ఏదో స్ఫురణకు వచ్చిన వాడిలా "గుడ్ అయిడియా!" అన్నాడు చిటికె వేస్తూ.

"ఏంటి గురూ!" అని అడిగారు మిగతా ముగ్గురూ.

"మనం రేపు రాబోయే రెండోతారీఖున అనగా ఆదివారంనాడు రాత్రి ఏడుగంటలకు ఆనందరావుగారి స్వగృహంలో మేడమీద గదిలో కాక్ టెయిల్ పార్టీ జరుపుకోబోతున్నాం!" అని చాటింపువేశాడు సుబ్బాబ్.

"ఇంపాజిబుల్!" అన్నాను నేను.

"నో... యిటీజ్ పాజిబుల్" అనేసి సుబ్బాబ్ బయటకు వెళ్లాడు. మేమంతా ఆశ్చర్యంగా నిల్చుండిపోయాం.

* * *

"టెలిగ్రామ్ సార్!" అన్న మెసింజర్ పిలుపు విని వరండాలోంచి బయటకు వచ్చాను.

సంతకంచేసి టెలిగ్రాం తీసుకొన్నాను. అందులోవున్న సమాచారాన్ని చూడగానే నా గుండెల వేగం హెచ్చయింది.

"ఎక్కణ్ణుంచండీ అది?" అంటూ బాబిగాడిని ఎత్తుకొని అన్నపూర్ణ బయటకు వచ్చింది.

ఆమెకు ఎలా చెప్పాలో నా కర్థం కాలేదు. ఆమె మనస్సు చాలా సున్నితం? ఏ కష్టాన్ని భరించలేదు.

"ఏమిటండీ! అలా వణుకుతున్నారు?"

"నిన్ను వెంటనే బయల్దేరి రమ్మని మీ నాన్నగారు టెలిగ్రామ్ యిచ్చారు."

"ఏమైనదండి? అంతా కులాసాయేనా" కంగారుగా అడిగింది.

"మరేంలేదు! మీ తాతయ్యను హాస్పిటల్లో ఎడ్మిట్ చేశారట!"

"ఆఁ..." అంటూ కొయ్యబారిపోయింది అన్నపూర్ణ.

తాతయ్యంటే అన్నపూర్ణ కెంతో యిష్టం!

రెండ్రోజుల క్రితమే అంది నాతో 'తాతయ్యను చూడాలని వుందండీ?' అని. ఇంతలోనే పాపం ముసలాయనకు సీరియస్‌గా వుందని టెలిగ్రామ్ వచ్చింది. ఈ షాక్ నుంచి అన్నపూర్ణ తేరుకోగలదా? అన్నపూర్ణ కళ్లవెంట అశ్రువులు కారటంచూసి బాబిగాడు మెల్లగా ఏడ్పులంకించుకొన్నాడు.

"అనూ! ఏమైందని అలా బాధపడ్తావ్! మీ తాతయ్యకు త్వరలోనే కులాసా చిక్కుతుంది లే!" అంటూ కన్నీరు తుడిచాను.

"మీకు తెలీదండీ! తాతయ్యకు సీరియస్‌గా వుండివుంటుంది. తాతయ్యతో మాట్లాడే అదృష్టం నాకు వుంటుందో, లేదో?" అంటూ నా గుండెల్లో తల దాచుకొని వెక్కి వెక్కి ఏడ్చింది అన్నపూర్ణ.

"పిచ్చిపిల్లా! టెలిగ్రామ్ చూసి అంత భయపడితే ఎలా?" అంటూ ఆమె తల నిమురుతూ ధైర్యం చెప్పాను నా మనస్సులో మాత్రం ధైర్యం సన్నగిల్లింది.

పది నిమిషాల్లో ప్రయాణమై బస్సు డిపోకు చేరుకొన్నాం. డిపోలోంచి బస్సు యింకా రాలేదు. అక్కడివాళ్లను ఎంక్వయిరీచేస్తే ఆ వూరినుంచి యింకా బస్సు రాలేదని, అదే వచ్చి తిరిగి వెళ్లాలని చెప్పారు.

ఇద్దరం సిమెంట్ బెంచీ మీద కూర్చున్నాం.

"అనూ! అనవసరంగా కంగారు పడకు! అసలు నేనుకూడా నీ వెంటవస్తే బాగుండేది! కాని నేను కొత్త సీట్లో రేపే జాయిన్ కావాలి! అదీగాక ఆడిటింగ్ జరుగుతూంది! రావటానికి వీలు పడదు! మీ తాతయ్యకు కులాసా చేకూరాలనే నా కోరిక! ఒకవేళ తప్పనిసరైతే నాకు



## విదేశాలలో వున్న మీ బంధుమిత్రులకు సాటిలేని కానుక!

# స్క్రిప్ట్ ఆర్ట్స్ గ్రీటింగ్ కార్డుల స్పెషల్ సెట్‌లు

## మీ అభినందనాలతో, మీ తరఫున మేము పంపగలము

విదేశాలలోవున్న ఆంధ్రులకోసం ప్రత్యేకంగా ఎక్స్‌పోర్ట్ క్వాలిటీ గ్రీటింగ్ కార్డులు రూపొందించ బడినవి. న్యూఇయ్యర్, సంక్రాంతి, ఉగాది పండుగుల సందర్భాలలో ఈ కార్డులను విదేశాలలో వున్నవారు వినియోగించుకోడానికి వీలుగా, భక్తిరంజని, న్యూఇయ్యర్, సంక్రాంతి, ఉగాది కార్డులను ఆరు రకాల స్పెషల్ సెట్‌లుగా చేశాము.

విదేశాలలో వున్నవారికి, ముఖ్యంగా తెలుగు కార్డులు లభ్యంకావు కనుక, ఈ స్పెషల్ సెట్‌లను మీ బంధు, మిత్రులకు మీరు పంపితే వారెంతో ఆనందించగలరు. ఇంతకు మించిన మరొక కానుక వుండబోదు. ఈ స్పెషల్ సెట్‌లను మీ అభినందనాలతో మీ తరఫున మేమే మీరు కోరినవారికి ఎయిర్ మెయిల్ పోస్టులో పంపగలము.

ఈ స్పెషల్ సెట్‌ల ధరలు—అమెరికా, కెనడా, బ్రిటన్‌లకు పంపడానికి ఈ సెట్‌లకు అయ్యే ఎయిర్ మెయిల్ పోస్టేజి ఖర్చులు ఈ ప్రకటనలోనే ఉదహరించాము.

ఎవరెవరికి ఏఏ స్పెషల్ సెట్‌లు పంపాలో వివరంగా వారి చిరునామాతో (ఇంగ్లీషులో విడివిడిగా వ్రాసి) ఆ సెట్‌ల ధరలకు ఎయిర్ మెయిల్ పోస్టేజిని చేర్చి, ఆ మొత్తాన్ని మనియార్డర్ ద్వారాకాని, మద్రాసులోని ఏ బ్యాంకి పైన అయినా డ్రాఫ్ట్‌ద్వారాగాని పంపితే, ఆ సెట్‌లను మేము పంపించగలము. అభినందనల పత్రంపై ఉదహరించడానికి వీలుగా మీ చిరునామాకూడా వివరంగా ఇంగ్లీషులో వ్రాసి పంపించండి. వెంటనే పంపితే, మీ బంధు, మిత్రులకు సకాలంలో వీటిని ఉపయోగించుకోడానికి వీలవుతుంది.

స్పెషల్ సెట్‌లలోగల గ్రీటింగ్ కార్డుల నమూనాగల ఫోల్డర్‌ను 50 పైసల పోస్టల్ స్టాంపు పంపినవారికి మాత్రమే పంపించగలము.








విదేశాలలోని ఆంధ్రులకు ఇదే ధరలకు స్పెషల్ సెట్‌లు లభించ గలవు. కావలసిన స్పెషల్ సెట్‌ల ఖరీదుకు వాటికయ్యే పోస్టేజి కూడా చేర్చి, ఆ మొత్తానికి మద్రాసులోని ఏ బ్యాంకి పైన అయినా డ్రాఫ్ట్ పంపితే సరాసరి మేమే ఆ సెట్‌లను పంపించగలము.

### అమెరికా, కెనడా, బ్రిటన్‌లలోని నగరాలకు పంపడానికి స్పెషల్ సెట్‌ల ధరలు; పోస్టేజి

| స్పెషల్ సెట్‌లు, వాటి ధరలు (రకానికొకటి చొప్పున ఒక్కొక్క సెట్‌లో వుండే కార్డుల సంఖ్య) | | ఎయిర్ మెయిల్ ఛార్జీలు అమెరికా, కెనడాలకు | బ్రిటిష్ నగరాలకు |
|---|---|---|---|
| 1. వేంకటేశ్వర సుప్రభాతం సెట్: (9 కార్డులు) | రు. 35.00 | 30.00 | 25.30 |
| 2. దేవీ స్తోత్రమాల సెట్: (7 కార్డులు) | రు. 25.00 | 25.00 | 21.30 |
| 3. శృంగారనాయికల సెట్: (8 కార్డులు) | రు. 20.00 | 12.00 | 10.95 |
| 4. న్యూఇయ్యర్ కార్డుల సెట్: (10 కార్డులు) | రు. 20.00 | 15.00 | 12.95 |
| 5. సంక్రాంతి సెట్: (27 కార్డులు) | రు. 60.00 | 25.00 | 20.50 |
| 6. ఉగాది సెట్: (12 కార్డులు) | రు. 30.00 | 14.00 | 12.15 |
| గ్రూప్ I పై ఆరు సెట్‌లు కలిపి (73 కార్డులు) | రు. 190.00 | 85.00 | 60.15 |
| గ్రూప్ II మొదటి నాలుగు సెట్‌లు (34 కార్డులు) | రు. 100.00 | 80.00 | 49.20 |
| గ్రూప్ III శృంగారనాయిక, సంక్రాంతి, ఉగాది సెట్‌లు (47 కార్డులు) | 110.00 | 40.00 | 33.00 |
| గ్రూప్ IV సంక్రాంతి, ఉగాది సెట్‌లు (39 కార్డులు) | రు. 90.00 | 32.00 | 25.70 |

**SCRIPT ARTS**



*Cards Division*
8 State Bank Street
Post Box No. 2248
MADRAS-600 002, INDIA
Cables: SCRIPTARTS
Phones: 85103, 812208







## కాక్ టెయిల్

"టెలిగ్రామ్ యివ్వండి!" అన్నాను బాబిగాణ్ణి కూర్చోపెడ్తూ.

"అలాగేనండి! ఇంటిని జాగ్రత్తగా చూస్తూండండి!" అంది బీరువా తాళం చెవులకోసం వేనిటీబ్యాగ్‌ను వెతుకుతూ.

"అయ్యో! సేఫ్ తాళం వేయలేదను కొంటానండి! సమయానికి తాళం కన్పడక యింటికూడా తాళం వేయకుండాపక్కింటి కుర్రాడికి అప్పజెప్పి వచ్చాం! మీరు త్వరగా వెళ్లి రండి!" అంటూ తొందర చేసింది అన్నపూర్ణ.

"ఫర్వాలేదులే, అనూ! నిన్ను బస్సెక్కించి వెళ్తానుగా!"

"బస్సుదేముంది? ముందు వెళ్లి సేఫ్ తెరిచి నా నగలన్నీ వున్నాయో లేవో చూడండి!" అంది కంగారుగా.

"సరే! రిక్షామీద వెళ్లివస్తానులే!" అంటూ లేచాను.

"మళ్లీ అంత దూరాన్నుంచి ఏమి వస్తార్లే! బస్సు రాగానే మేం వెళ్లిపోతాం లెండి!" అంది అనూ.

బాబిగాణ్ణి ముద్దు పెట్టుకొని అన్నపూర్ణకు అందించి "జాగ్రత్త! కంగారు పడకు!" అని చెప్పి ఇంటివైపు నడిచాను.

నేను ఇంటికి చేరుకొనేసరికి ఏడయింది. గేటు తీసుకొని లోపలికి అడుగు పెట్టగానే మేడమీద గదిలో వెల్తురు కన్పించింది.

పక్కింటి కుర్రాడు చెప్పాడు "మీ ఫ్రెండ్సు వచ్చారండి! మీరు రాగానే పైకి రమ్మన్నారు."

మేడమెట్లెక్కుతుంటే లోగడ సుబ్రావ్ అన్న మాటలు గుర్తుకువచ్చాయి. అవును! ఇవ్వాళ ఆదివారం! ఏడు గంటలు! కాక్ టెయిల్ పార్టీ... వెంటనే అనుమానం వచ్చి జేబులోని టెలిగ్రామ్‌ను పరీక్షగా చూశాను.

"హార్రీ! సుబ్రావ్! ఎంత పని చేశావ్?" అరిటూ మెట్లెక్కాను.

"ఏం బ్రదర్! మా వదినగారు వాళ్ల వూరెళ్లే బస్సెక్కారా?" సుబ్రావ్ పల్కరించాడు.

"ఎంతపని చేశావయ్యా! అనవసరంగా మీ వదినను హడలకొట్టేశావ్! ఇందాకటి వరకు బస్సు రాలేదు ఉండు వెంటనేవెళ్లి అన్నపూర్ణకు నిజంచెప్పి తీసుకువస్తాను" అన్నాను.

సుబ్రావ్ వెంటనే "ఇదుగో బ్రదర్! అమెను పుట్టింటికి వెళ్లనీ! అందర్నీ చూసినట్లు వుంటుంది. మనమూ ఫంక్షన్ సెలెబ్రేట్ చేసుకొన్నట్లూ వుంటుంది. కమాన్ లెటజ్ ప్రొసీడ్!" అన్నాడు.

"నో...లాభంలేదు. నేను బస్సు డిపోకు వెళ్తాను." అన్నాను మెట్లు దిగుతూ.

"ఇవ్వాళమాత్రం పార్టీ ఆపేవనిలేదు. సరంజామా అంతా రెడీ!" అంటూ సుబ్రావ్ నన్ను లాక్కొనివెళ్లి గదిలోవున్న టీపాయ్‌ను చూపించాడు. దాన్నిండా సీసాలు, గ్లాసులు, ఐస్ ముక్కలు, జీడిపప్పు, చిప్స్ వగైరాలున్నాయి.

"ఏమైనాసరే నేను వెళ్లి అన్నపూర్ణను తీసుకురావాలి!" అంటూ గబగబ మెట్లు దిగాను!

"వచ్చేటప్పుడు వట్టిచేతులతో రాకుండా మాకు చికెన్, బిర్యానీ, ఆమ్లెట్స్ పార్సెల్ చేయించుకురా!" అన్నాడు సుబ్రావ్ వెనుక నుంచి.

"యూ ఫూల్!" అనుకొంటూ రోడ్డుమీదికి వచ్చాను.

నేను బస్సుడిపోకు వెళ్లేసరికే ఆ బస్సు వెళ్లిపోయిందన్నారు. చేసేదేమీలేక సుబ్రావ్ చెప్పిన వస్తువుల నన్నింటినీ పార్సెల్ చేయించుకొని రిక్షాలో యింటికి చేరాను.

వాతావరణం అంతా ప్రశాంతంగా వుంది. అందరూ ఇళ్లకు జారుకొన్నారేమో అనుకొంటూ మేడమీదికి వెళ్లి గది తలుపులు తోశాను. చతుర్ముఖ పారాయణంలో మునిగి వున్నారు.

"థాంక్యూబాస్! నేను కోరిన విధంగా ఫుడ్ ప్రాబ్లెమ్ సాల్వ్ చేశావు. టైమ్ వేస్ట్ చేయటం మంచిది కాదని కార్డ్స్ కలిపాం" అన్నాడు సుబ్రావ్ ముక్కలు కలుపుతూ.

"దట్సాల్‌రైట్! ప్రొసీడ్" అన్నాను నీరసంగా.

"థాంక్యూ! బైదిబై! మర్చిపోయాను! మన పార్టీకి ఓ కొత్త మెంబరు వచ్చాడు. ఇప్పటివరకు యిక్కడే కూర్చుని వెళ్లాడు. పార్టీ మొదలు కాగానే తనను పిలవమన్నాడు" అన్నాడు శర్మ.

"ఎవరా కొత్త మెంబర్! మీ ఫ్రెండా?" అన్నాను సుబ్రావ్ నుద్దేశించి.

# సింథాల్

## దుర్గంధాన్ని నిర్మూలించి తాజాదనం గల్గించే సబ్బు.




చమట వలన గలిగే శరీర
దుర్గంధాన్నుండి
శక్తివంతంగా కాపాడుతోంది.
ఏ సబ్బు పూర్తిగా వుంచనంత
తాజాగా మిమ్ములను
వుంచుతుంది.

సౌందర్య రక్షణకై చర్మ రోగ
నిపుణులచే సిఫారసు చేయబడింది.

# కాక్ టెయిల్

"నో...నో...మీ ఫ్రెండ్! మీ పక్కింటాయనట!" గుర్నాథం అన్నాడు. నేను మరింత ఆశ్చర్యపోయాను.

"మా పక్కింటాయనేమిటి? పార్టీకి పిలవమని చెప్పి వెళ్లట మేమిటి? మా పక్కింటాయన ఆచారిగారు. ఉల్లిపాయల వాసన కూడా గిట్టదాయనకు! మరి మందు పార్టీకి వస్తాడా"? అంతా అయోమయంగా వుంది.

"సుబ్రావ్! ఆయన్ని నువ్వు చూశావా?"

"లేదు బ్రదర్! నేను కార్డ్సు కోసం బయటకువెళ్లాను. నేను వచ్చేముందే మెట్లు దిగాడట! ఆయన వరండాలో కూర్చుని వుంటానన్నాడట! త్వరగావెళ్లి పిల్చుకురా!" అన్నాడు సుబ్రావ్ ముక్కలు సర్దుకొంటూ. నేను ఆశ్చర్యంగా మెట్లు దిగాను.

వరండాలో కుర్చీ వేసుకొని ఎవరో కూర్చున్నారు. ఇంతకుముందు నేను మేడ మీదికి వచ్చినపుడు అక్కడెవ్వరూ లేరు. ఇంతలోనే ఎలావచ్చారు? కొంపతీసి ఏ దొంగ వెధవయినా రాలేదు కదా?

హడావుడిగా మెట్లు దిగాను.

"ఎవరండీ?" అన్నాను బిగ్గరగా.

"నేనేనయ్యా!" అంటూ వెనక్కి తిరిగాడు కుర్చీలోని వ్యక్తి.

అంతే!

నేను కొయ్యబారిపోయాను.

ఆయన... ఆయన... అన్నపూర్ణ వాళ్ల తాతయ్య!

"ఎంతసేపయిందండీ వచ్చి?" అని అడిగాను అతి కష్టంమీద. నాకు సమాధానం చెప్పకుండా నవ్వుతూ గుమ్మంవైపు చూపించాడు. ఎదురుగా అన్నపూర్ణ బాబిగాణ్ణి ఎత్తుకొని గుమ్మంలో నిలబడింది

"మేం వచ్చి పావుగంట దాటిందండీ! బస్సు డిపోలో తాతయ్య కన్పించారు. ఇద్దరం కల్సి రిక్షాలో వచ్చాం!" అంది అన్నపూర్ణ.

ముసలాయన మెల్లగా లేచి నా దగ్గరకు వచ్చి "పాపం! ఏదో టెలిగ్రామ్ వచ్చిందటగా!" అని అడిగేసరికి ఆయనకు ఏం సమాధానం చెప్పాలో తెలియక గబగబ మేడ మెట్లెక్కాను. 

# బ్రిటానియా పాల బిస్కట్



## పెరిగే పాపాయిలకు రుచివంతమైన తోడు!




**రుచికరమైన, పుష్టికరమైన బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు**




బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్-BBC.GLX.36-203 TL






బెల్లారి సీతారాజేశ్వరరావు

పరాంకుశానికి క్రాస్ వర్డ్ పజిల్స్‌లో పన్నెండువేలు వచ్చాయని శర్మ చెప్పగానే అవాక్కయిపోయాను నోట మాట కూడా రాలేదు. దేనికయినా అదృష్టముండాలి కాబోలు. నేను గత ఏనిమిదేళ్ళుగా పజిల్స్ పట్టుకుని పాకులాడుతున్నాను. చివరి ప్రయిజుకూడ రాలేదు. పరాంకుశం మొదటి సారే లక్కీఛాన్సు కొట్టేశాడు.

సాయంత్రం ఆఫీసయిపోగానే గాంధీ నగరంలో అతడి గదికి వెళ్ళాను. పరాంకుశం అప్పుడే కాలేజీనుంచి వచ్చికూర్చుని విశ్రాంతి తీసుకుంటున్నాడు.

నేను విష్ చేశాను. పరాంకుశం బాక్స్ ఆఫీసు హీరోలా నవ్వాడు. వాడిఫోజు చూడగానే నాకు ఒళ్ళు మండిపోయింది. ధన దర్పం అప్పుడే వచ్చింది వాడిలో.

సుమిత్ర టీ యిచ్చింది.

"ఇంకా టీ ఏమిటమ్మా... మంచిపార్టీ యివ్వక. మానాడిలాగే యింక ప్రయిజులు కొట్టేస్తుంటాడు" నవ్వుతూనే అన్నాను. అందులోని ఈర్ష్య నాకే స్పష్టంగా అర్థమైంది.

"ఈ వెర్రిలోపడి వున్నది తగలేసుకోకుండా వుంటే చాలు" సుమిత్ర లోపలికెళ్ళిపోయింది. ఆ సంసారానికి సుమిత్రక్షంజను. పరాంకుశం ఖాళీ బోగీలాంటివాడు.

"అది నిజమేలే... రేసుల్లో యింకా సంపాదించాలని ఎంతమంది పతనమయిపోలేదూ?" దీర్ఘంగా సాగదీశాను. పరాంకుశంకూడా ఆకోవలో చేరిపోతాడన్నది నాలోని ఈవిల్ ప్లెజర్.

పరాంకుశానికే సంభాషణం రుచించలేదేమో... లేచాడు. డ్రెస్సింగ్ టేబుల్ దగ్గర తల దువ్వుకున్నాడు. పౌడర్ రాసుకున్నాడు.

"ఎక్కడికయినా ప్రయాణమా ?..."

"అబ్బే... అలా బజార్లోకి... ఎంటర్ ది డ్రాగన్ ఆఖరిరోజు కదా... నువ్వు చూశావా?" అనడిగాడు చెప్పులేసుకుని.

"లేదు... నడు..." పరాంకుశం అనేక పార్టీ యివ్వకపోయినా యిదయినా దక్కుతుంది,

# అన్ని వయసుల పిల్లలకీ

Parry's



లాక్టో బాన్‌బాన్, ఆరెంజ్
కాండీ, లెమన్ బార్లీ కోకోనట్స్..
ఆనందమిచ్చే
ఘరెన్నిటితోనో
పండగ కూడా.






మిఠాయిలు మరియు టాఫీలు

ప్యారిస్ కన్ఫెక్షనరీ లిమిటెడ్

PRS/2781/TEL

## విమానాశ్రయం వెల ఎంత?

లండను హీత్రో విమానాశ్రయంలో పనిచేసే వారిలో 850 మంది సమ్మె చేయడంవల్ల ఎక్కడి పనులు అక్కడే స్తంభించి పోయాయట. సొంత విమానంలో వచ్చి ఆ విమానాశ్రయంలో విమానాన్ని దించిన ఓమన్ దేశపు రాజుగారు ఓ మూడు గంటలు ఓపిగ్గా తన విమానంలోనే కూర్చుని ఆనక చిరాకు పుట్టి ఆ విమానాశ్రయం లోని కంట్రోలు రూములోని అధికారులతో ఈ విమానాశ్రయాన్ని ఎంతకమ్ముతారో కాస్త త్వరగా చెప్పండి. కొనుక్కుని, నా పనివారిని పెట్టుకు నయినా నా విమానం దిగుతాను. ఎంతసేపిలా కూర్చునేది అన్నారట.

## ఖైదీల ఆశ్చర్యం!

చైనా దేశంలోని ఒక జైలులో ఒక ఖైదీ ఆ గదిలోని మిగతా ఇద్దరితో సంబంధం లేకుండ ఓ వారగా కూర్చున్నారట. ఆ ఇద్దరు ఖైదీలలో ఒకతను తాను సింగ్‌సా అనే అతన్ని, అతని పక్షాన్ని ఎదిరించి నందువల్ల జైలుపాలై నట్టు చెప్పాడట. దానికా శ్రోత ఖైదీ ఆశ్చర్యం ప్రకటించి నేనూ సింగ్‌సాను ఎదిరించిన కారణాన్నే ఇందులో పడ్డాను అన్నాడట. ఇద్దరూ ఆశ్చర్యం లోంచి తేరుకున్నాక ఆ మూడో అతని పక్కకు

## ఫైల్యాసి డైరి

వెళ్ళి మీరెందుకు జైల్లో పడ్డట్టు అని అడిగితే ఆ సింగ్‌సాను నేనే అయినందు వల్ల అన్నాడట·

దటీజ్ పాలసీ ఆఫ్ చైనా!!

## భార్యకు విషం పెట్టి చంపిన భర్త!

ఓమలూరు కు చెందిన 42 ఏళ్ళ శివజ్ఞానం అనే ఓ స్కూలు మేస్టారు భార్య 35 ఏళ్ళ మరకతం కూడా బి. ఏ. బి.టి ప్యాసయి ఓ స్కూల్లో టీచరు పని చేస్తోందట ఆమెకు ఒళ్ళు బాగు లేదని ఆమె రాసిన శలవుచీటీ ఆమె భర్త ఆమె పని చేస్తున్న స్కూల్లో ఇచ్చివచ్చాడట. ఆ రోజే ఆమె చనిపోయిందట. కడుపునొప్పి, గుండె నొప్పి వల్ల అకస్మాత్తుగా చనిపోయిందని ఆమె శవాన్ని పాతిపెట్టేశాడట ఆమె భర్త. యథావిధిగా కానీ ఆమె తండ్రి తన కూతురుకు అటువంటి జబ్బులు లేవని, కొన్నాళ్ళుగా ఆదంపతులమధ్య నప్పుగడ్డి వేస్తే భగ్గుమంటోందని, అల్లుడు తన కూతుర్ని చంపేసుంటాడని తన అనుమానాన్ని పోలీసులకు ఫిర్యాదు చేస్తే వారు శవాన్ని త్రవ్వి బయటకు తీసి, పరీక్షకు పంపితే ఆమె మరణం విషప్రయోగం వల్లనని తేలిందట. మరకతం ఒంటి మీద కొన్ని పొడల వంటి మచ్చలున్నాయట. ఈ మచ్చలు, ఆమె పక్కన ఆమె భర్త వేరే పెళ్ళి చేసుకోవాలని మరకతాన్నెలాగయినా వదుల్చుకోవాలని కొన్నాళ్ళుగా తీవ్ర యత్నం చేస్తూ చివరికీ క్రియ కొచ్చినట్లు పోలీసు కనుగొన్నారట.

## భూమిలోకి దిగిపోతున్న బ్యాంగ్ కాక్!

యాభై లక్షల జనాభా వున్న బ్యాంగ్‌కాక్ నగరం కొంచెం కొంచెంగా భూమిలోకి కృంగి పోతోందట. అత్యద్భుతమైన ఈ నగరాన్ని కాపాడ్డమెలా అని ఆ నగర అధికారులు కృంగిపోతున్నారట.

## గ్యాస్ పొయ్యివల్ల రోగాలు!

గ్యాసు పొయ్యిలువున్న ఇళ్ళల్లోని పసిపిల్లలకు శ్వాసకు, ముక్కుకు, ఊపిరి తిత్తులకు సంబంధించిన రోగాలు వస్తాయని, వస్తూనే వుంటాయని బ్రిటిష్ మెడికల్ జర్నలు వివరించిందట.

## తుమ్ముల వాయువు!

భాష్పవాయు ప్రయోగానికి కూడా అల్లరి దారులు లొంగటం లేదని దక్షిణ ఆఫ్రికా మరో కొత్త వాయువు కని పెట్టిందట. ఈ వాయువు ప్రయోగం వల్ల విపరీతమైన తుమ్ములొస్తాయట ఎడతెగని తుమ్ములు వచ్చినందువల్ల చైదలు కున్న పనికి అంతరాయం కదా!

---

ఆఖరి రోజయినా బాక్సు నిండుగానే వుంది. సినిమా యింకా ప్రారంభం కాలేదు. స్టెషన్ మ్యూజిక్ వస్తోంది. నా దృష్టి కలర్స్‌మీద వుంది.

పరాంకుశం చెయ్యొక్కి "పర్స్ దొరికిందోయ్..." అని చెప్పాడు.

నా మనస్సు వుడికిపోయింది. ఇలాంటి అదృష్టం ఒక్కటీ పట్టదేమిటి నాకు? పరాంకుశానికి శుకదశ పట్టినట్లుంది. "ఎంతుందేమిటి?..." అసూయగా అడిగాను.

"దాదాపు మూడు వందలు."

చటుక్కున నా మనస్సులో మెరుపు మెరిసింది. వెనకరోలో కూర్చున్న ఆర్ముగం బయటికి వెళుతున్నాడు. వాడూ నా ఫ్రెండే ఆర్ముగాన్ని పిలిచి చెప్పాను.

"ఫిఫ్టీ...ఫిఫ్టీ" అన్నాడు ఆర్ముగం.

తలూపి సిగరెట్ రెండు దమ్ముల్లో వూదేసి హాల్లోకి వచ్చాను. ట్రయిలర్ జరుగుతోంది. అయిదు నిముషాలు పోయాకా ఆర్ముగం..."సార్ పర్స్ క్రింద పడింది ... ఎవరయినా చూశారా" అంటూ అడుగుతున్నాడు. ఆ సంభాషణం మాకూ వినిపించింది.

"పర్స్ ఆర్ముగానిదేమో ..."

## భస్మాసుర

పరాంకుశంతో నెమ్మదిగా అన్నాను.

"మరి యిందాకట్నుంచి వూరుకున్నాడేం ?"

"వెతుక్కుంటున్నాడేమో ... యిచ్చెయ్ పరాంకుశం ... అన్యాయం సొమ్ము అచ్చిరాదు. పాపం ఎంతబాధపడుతున్నాడో" అన్నాను మెహర్బానీగా.

"ఇచ్చేయనా ? సరే ... నువ్వు చెప్పాకా కాదంటానా ?"

ఆర్ముగాన్ని పిలిచి పరాంకుశం పర్స్ యిచ్చేశాడు.

సినిమా అయిపోగానే యిద్దరం బయటికి వచ్చాం. దిల్‌కుష్ డ్రింక్స్ దగ్గరకొచ్చేసరికి వాన ప్రారంభించింది.

"పద లోపలకెళదాం" నువ్వు పార్టీ అడ్వాన్స్‌గా యిస్తున్నావు మాట.

"మరోసారి చూద్దాం ?"

"ఇవ్వనని చెప్పరాదూ ?"

'అబ్బే ప్రస్తుతం డబ్బులేదు. నువ్వు అప్పు పెడితే తర్వాత యిస్తాను."

"సరే...పద"

కూల్డ్ బీర్ త్రాగి యిద్దరం లేచాం. బేరర్ బిల్లు తీసుకువచ్చాడు. నేను జేబులో చెయ్యి పెట్టాను! షాక్ ...పర్స్ లేదు ... చెమటలు పట్టేసయ్.

"ఏమిటి వెతుకుతున్నావ్ ?"

చెప్పాను.

"ఇందాకా సినిమాహాల్లో దొరికింది నీ పర్సే. నిన్ను ఏడిపించి యిచ్చేదామనుకున్నాను. కాని నువ్వు యింతలో పథకం వేసుకొచ్చావ్ యిచ్చేశాను. సో యు ఆర్ ది విన్నర్ అండ్ లూజర్."

పరాంకుశం బిల్లు చెల్లించేశాడు.

నేను అక్కడ వుండలేక రిక్షాలో యింటికి బయలుదేరాను. జరిగిన పరాభవం నన్ను కాల్చివేస్తున్నది. గాంధీ నగర్ సెంటర్లోని కిళ్లీబడ్డీ దగ్గర ఆర్ముగం కనిపించి రిక్షా ఆపాడు. "నీ వాటా నూటయాభై రెండు గురూ భలే ప్లే చేశావ్ ? రేపు పార్టీ చేసుకుందామా ?" అన్నాడు డబ్బు యిచ్చి.

పోర్షను రాని నటుడిలా పిచ్చిగా నవ్వి రిక్షా పోనియమన్నాను.

పరాంకుశాన్ని దెబ్బ కొడదామని నేనే తిన్నాను.

# 20వ శతాబ్దపు అమోఘ టానిక్



TRADE MARK Regd. No. 218726 Manufacturing licence A.U.S. 69/76

BEFORE TAKING



After taking 2 lbs



After taking 4 lbs



After taking



# జీవన్‌టోన్

అకిమీ (ఆర్డర్ల) పిటిస్తి కారీకు అయిపోయి నందు వలన దయచేసి తమ ఆర్డర్లు మరియు లెటర్లు బెంగళూరు అడ్రసుకు పంపండి.

అలసట, రక్తహీనస్థితి, నిరుత్సాహం, నిద్రలేమి, బరువు తగ్గుట, ఆకలి లేకపోవుట, కృశించుచున్నట్లని పించుట, నివారించుటకు ఆదర్శ టానిక్. ఈ టానిక్ పిన్నలకు, పెద్దలకు, వయస్సు మీరినవారికి, స్త్రీలకు, పురుషులకు చాల ఉపయోగకరమైనది. 3, లేక 4 కిలో గ్రాముల జీవన్‌టోన్ మాత్రమే మీకు తగినంత బరువును, ఆరోగ్యాన్ని ఉత్సాహాన్ని ఇవ్వగలదు. ఎదిగే పిల్లలకు ఇది అతి శ్రేష్ఠమైనది.

దీనిలో జంతుసంబంధమైన క్రొవ్వు కలసిందని, అందు చేతనే ఇంత త్వరితముగా బరువు, ఆకారము ఎక్కువ అవటాన్కి తోడ్పడుతుందని కొందరికి అనుమానం కలగవచ్చు. అట్టివారికి ఈ టానిక్‌లో కాయగూరల క్రొవ్వు, అరుదైన మూలికలు తప్ప వేరేమి చేరియుండలేదని హామీ ఇస్తున్నాం. కావలసినంత బరువు వచ్చిన తర్వాత జీవన్‌టోన్ వాడకం మాని వేయవచ్చు.

జీవన్‌టోన్ ఈ దిగువ కేంద్రములలో మా స్టాకిస్టుల వద్ద దొరుకును

• శ్రీకాకుళం : పట్నాల సత్యనారాయణ & సన్స్, పాలచెట్టు వీధి. • టెక్కలి : టి.యస్.ఎస్. మూర్తి, మెయిన్ రోడ్డు. • కాశీబుగ్గ : తంగుడు నారాయణమూర్తి, మెయినురోడ్డు • విజయనగరం : బత్తుల లింగప్రసాదరావు, మెయినురోడ్డు • విశాఖపట్నం : సీలం & కో, ఎ.వి.ఎన్. కాలేజిరోడ్డు. • అనకాపల్లి : కుసుమంచి అప్పలరాజు, మెయినురోడ్డు, • కాకినాడ : 1. లక్ష్మీనారాయణ కంపెనీ, సంత చెరువు దగ్గర & జగన్నాథపురం. 2. కమర్షియల్స్ - సూర్యనివాస్, సూర్యారావుపేట. పాలకొండ : సూర్యాడ్రగ్ హౌస్. • ఇచ్ఛాపురం : జనతా మెడికల్ స్టోర్స్, మెయినురోడ్డు • రాజమండ్రి : ఈశ్వరదాసు & కం. జైహింద్ బిల్డింగ్ వద్ద. తెనాలి : గుడివాడ హనుమంతరావు & సన్స్, మెయినురోడ్డు. • గుంటూరు : ఆంజనేయ మెడికల్స్, ఛాంబర్ ఆఫ్ కామర్సు బిల్డింగు వద్ద, • రేపల్లె : రామకృష్ణా మెడికల్ & జనరల్స్ • విజయవాడ : 1. సూర్య మెడికల్ స్టోర్స్, పార్కురోడ్డు. 2. ధనలక్ష్మి మెడికల్ స్టోర్స్, సత్యనారాయణపురం. లక్ష్మి మెడికల్ స్టోర్స్, బీసెంటురోడ్డు. • మచిలీపట్నం : ఉమామహేశ్వరి ఆయుర్వేద ఏజన్సీస్, అజాద్‌రోడ్డు. • నెల్లూరు : కె. యస్. రావు & సన్స్, ట్రంకురోడ్డు. • మదనపల్లి : హయగ్రీవ షాపు 6/77 నెహ్రూవీధి. • గుంతకల్లు : గోపాల్ మెడికల్ హాల్ మెయిన్‌రోడ్డు. • జంగారెడ్డిగూడెం : దోనా వెంకట్రావు మెయినురోడ్డు. • పార్వతీపురం : పద్మిని మెడికల్ స్టోర్స్, మెయిన్‌రోడ్డు • సికింద్రాబాదు : శారదాస్టోర్సు 3106, రాష్ట్రపతిరోడ్డు, సూర్యామెడికల్ హాలు జామ్మా మసీదు దగ్గర. డి. జె. పరేఖ్ & కం, సుభాష్‌రోడ్డు. జ్యోతి మెడికల్ హాల్, మహాత్మాగాంధీరోడ్డు. • హైదరాబాదు : అయుద్ధాం మెడికల్ హాల్ కోఠి. బస్‌స్టాండు వద్ద, జయరాం మెడికల్ హాల్, సుల్తానుబజారు. వసంత మెడికల్ స్టోర్సు, బ్యాంకురోడ్డు కోఠి. • సంపత్ & కంపెని, పంజాగుట్ట. మహేశ్ మెడికల్ హాలు సుల్తానుబజారు. విష్ణు మెడికలు హాలు, గుల్జార్ హౌస్. • అనంతపురం : అనంతపురం ఆయుర్వేదిక్ మెడికల్సు, మోలివీధి. • విశాఖపట్నం : డా॥ జె. ఎ. శాస్త్రి, సూర్యాబాగ్ జంక్షను. • గుంటూరు : శ్రీ సత్యనారాయణ ఏజన్సీస్. • హైదరాబాదు : సాయిరాం మెడికలు హాలు, కోఠి. • వరంగల్లు : ఆయుర్వేద రసాయనశాల, జె. పి. ఎన్. రోడ్డు.

450 గ్రాములు రు. 15-50

(పన్నులు అదనం)

సెల్ఫో అయిబు-పౌడరు (పురుషులకు మాత్రమే)

రెండూచేరి రూ. 24 -

స్కిన్‌లీమ్సు : మొటిమలనుమాన్పి మీ ముఖానికి అధిక కాంతిని, అందాన్ని ఇస్తుంది.

రెండు టొన్నులు- రూ. 15/-

లెడాసిన్ : స్త్రీల రోగములకు దివ్యౌషధము.

నెలసరి మాత్రలు- రూ. 20/- (పన్నులు అదనం.)

తయారు చేయువారు

**జీవన్‌టోన్ ప్రొడక్ట్సు**

పోస్టుబాక్సు నెం. 880. 17/1 కేంబ్రిడ్జి రోడ్డు.

**అల్సూరు – బెంగుళూరు – 560008**

లైసెన్సు నెం. ఎ. వి. ఎస్. 69/76 రిజిష్టర్డు నెం. 218726



# మాయాజాలం మణికట్టు



## షేక్‌హేండ్ మిస్టరీ

విద్యకు తగు వినియోగం వుండాలి మరి. విద్య నేర్చుకోడంతోనే సరికాదు. దాన్ని సందర్భాను సారంగా వినియోగించు–కోడం కూడా ఎంతైనా అవసరం.

ఒకసారి ఒకవూరి ఆఫీసర్సు క్లబ్‌లో ఒక బ్రహ్మాండమైన సభ ఏర్పాటయింది.

ఆ వూరి ఆఫీసర్సు క్లబ్ అధ్యక్షులైన జిల్లా కలెక్టరుగారు సభాసదుల ముందు ఇంద్రజాల ప్రదర్శన నిమిత్తమై నన్ను ఆహ్వానిస్తే నేను కూడా వెళ్లాను.

ప్రభుత్వ ప్రతినిధులతోనూ, రాజకీయ నాయకులతోనూ; ఆహ్వానితులతోనూ, పత్రికా ప్రతినిధులతోనూ, ఆఫీసర్సు క్లబ్ అత్యంత కోలాహలంగా వుంది.

కలెక్టరుగారు వచ్చిన వారందరికి నన్ను పరిచయం చేయడం మొదలు పెట్టారు.

ఈ లోగా కారులో కాసు బ్రహ్మానంద రెడ్డిగారు దిగారు.

''మీట్ మిస్టర్ కామేష్. ఎ యంగ్ మెజిషియన్ అండ్ హిప్నాటిస్టు'' అంటూ కలెక్టరుగారు నన్ను పరిచయం చేశారు.

నేనూ, బ్రహ్మానందరెడ్డిగారు 'షేక్ హేండ్' యిచ్చుకున్నాం. అంతే! మా యిద్దరి చేతుల్లోంచి 15 రూపాయి కాసులు గలగల మంటూ నేలమీద పడ్డాయి.

వెంటనే 'వాట్ ఈజ్ దిస్' అనిఆయన అడిగారు. 'దిస్ ఈజ్ మై ఇంట్రడక్టరీ అయిటమ్' అని ఒక చిరునవ్వు నవ్వాను.

ఆయనే కాక, 'కనికట్టు' ప్రజ్ఞతోనే కాసు బ్రహ్మానందరెడ్డిగార్ని పరిచయం చేసుకున్నందుకు కలెక్టరుగారితో సహా అక్కడికి విచ్చేసిన పెద్దలందరూ ఆశ్చర్య పోతూ అభినందించారు.

ఆ రోజు ఆ 'షేక్ హేండు' ద్వారా అన్ని రూపాయికాసులను సృష్టించగలగడం లోని రహస్యం! అదే నా 'హస్తలాఘవం!'

## "శూన్యం నుండి బియ్యం!"

తర్వాత జూన్ 13వ తేదీ, ఉదయం 10గంటలయింది. ఫోన్ గణ గణ మోగింది.

రిసీవర్ అందుకుని ''హల్లో... మెజిషియన్ కామేష్ స్పీకింగ్'' అన్నాను.

రాజ్‌భవన్ నుంచి ఫోన్‌కాల్!

గవర్నర్ ప్రెస్ సెక్రటరీ ఫోన్ చేశారు. సాయంత్రం 6 గంటలకు నా ఇంద్రజాల ప్రదర్శనరాజ్ భవన్‌లో ఏర్పాటు చేశారట.

'సరే' అని ఫోన్ పెట్టేశాను.

సాయంత్రం నా 'మాజిక్ కిట్' తో రాజభవన్ చేరుకున్నాను. రాజ్‌భవన్ అంతా బాలబాలికలతో చాలా సందడిగా వుంది.

''ఆంధ్రప్రదేశ్ దర్శన్'' విజ్ఞాన యాత్ర ముగించుకుని వచ్చిన బాలబాలికలకు గవర్నర్ శ్రీమతి శారదా ముఖర్జీ స్వయంగా శుభాశీస్సులను అందజేయడానికి రమణీయమైన 'లాన్స్'లో ఫంక్షన్, అది.

నేను ప్రదర్శించవలసిన వేదికకి ముందుగా ఒక క్రమపద్ధతిలో బాలబాలికలు కూర్చున్నారు. వారి వెనుకగా కొద్ది దూరంలో సింహాసనంమీద రాష్ట్రగవర్నరు, యిరువైపుల కార్యదర్శులు, వెనుకవైపు ఎ. డి. సి. లు, మిగిలిన సోఫాలలో ప్రభుత్వ ప్రతినిధులు, ఆహ్వానితులు కూర్చున్నారు.

ఒకప్రక్క ఫొటోగ్రాఫర్లు, వేరొక వైపు సమాచార శాఖ ఫిలిం యూనిటూ రెడీగా కెమేరాలతో నిలబడి వున్నారు.

సరిగ్గా 6 గంటలయింది. ముందుగా చేతికర్రను పూలగుత్తిగా మార్చి అందర్నీ ఆకట్టుకున్నాను.

తర్వాత 'దెయ్యాల పెట్టె' అంటూ ఒక ఖాళీ పెట్టె చూపించి దాంట్లోంచి చాకెలెట్లు, మిఠాయిలుతీసి బాల బాలికలకు పంచిపెట్టాను

ఆ విధంగా దాదాపు పదినిముషాలసేపు నా ప్రదర్శన ఆకర్షణీయంగా సాగింది.

తర్వాత రాష్ట్ర గవర్నర్ దగ్గరగా వెళ్ళి గవర్నర్‌తోసహా అందరికి కనిపించేలా నా చేతులు 'ఖాళీ' అని చూపించాను.

తర్వాత నా రెండు చేతులను దోసిలిగా చేసి, గవర్నర్‌ని దోసిలి పట్టమని చెప్పి, నా దోసిలి విడిచాను. ఇంకేముంది! ఆశ్చర్యం!

నా దోసిలిలోంచి బియ్యం జల జలా రాలి గవర్నర్ దోసిలిలో పడి, దోసిలి నిండింది.

ఇంతలో ఐదారు కెమేరాలు 'క్లిక్' మన్నాయి. సభాసదుల హర్షధ్వానాల మధ్య

''దేరీజ్ నో ఫుడ్ ప్రాబ్లమ్'' అంటూ గవర్నర్ శ్రీమతి శారదాముఖర్జీ ఆశ్చర్యంతో చూస్తూ వుండిపోయారు.

ఎడతెరిపిలేని హర్షధ్వానాలతో నా ప్రదర్శన పరిసమాప్తమయింది.

రహస్యం :– ఆ రోజు ఆ విధంగా ఖాళీ చేతులలో నుండీ 'బియ్యం' సృష్టించగలగడంలోని రహస్యం? అదే నా హస్తలాఘవం. ఈ రెండు హస్తలాఘవముల గురించి తెలుసుకోవాలనుందా? వచ్చే వారం దాకా ఆగండి మరి...

గవర్నర్ శ్రీమతి శారదాముఖర్జీ దోసిలిలోకి ఖాళీచేతులు చూపించి బియ్యం కురిపిస్తున్న ఫోటో



## హైదరాబాద్ నోట్ బుక్

### డా. శ్రీ కొలచల సీతారామయ్య స్మృతికి సంతాపం

సోవియట్ యూనియన్‌లో సుప్రసిద్ధ పెట్రో కెమికల్ ఇంజనీరు, పెట్రో కెమికల్ ఇంజనీరింగ్ శాఖాధ్యక్షులు శ్రీ కొలచల సీతారామయ్య సెప్టెంబర్ 29 వ తేదీ రాత్రి మాస్కో నగరంలోని ఒక ఆస్పత్రిలో మృతి చెందారన్న వార్త విని ఇక్కడి ఆయన అభిమానులు చాల సంతాపం చెందారు. శ్రీ సీతారామయ్య సోవియట్ యూనియన్‌లో స్థిరనివాసం ఏర్పరచుకొన్న తొలి భారతీయులలో ఒకరు. అక్కడే ఆయన వివాహం చేసుకున్నారు. ఆయన తన కుమార్తెలిద్దరికి నీలవేణి, కృష్ణవేణి అని పేరు పెట్టారు. ఆయన వయస్సు 76 సంవత్సరాలు. ఆయన కొంత కాలంగా గుండె జబ్బుతో విశ్రాంతి తీసుకుంటున్నారట. ఇంతలో నిమోనియా జ్వరం తగులంగా ఆస్పత్రిలో చేర్చారు. ఆస్పత్రిలోనే మరణించారు. సీతారామయ్య కృష్ణా జిల్లా ఉయ్యూరులో జన్మించారు. కళాశాలలో చదువుతూ జాతీయోద్యమంలో పాల్గొన్నారు. పిదప టాగూరు కులపతిగా నెలకొన్న విశ్వభారతి యూనివర్సిటీలో రసాయన శాస్త్ర పట్టభద్రుడై అమెరికాకు వెళ్లారు. అక్కడ పెట్రో-కెమికల్ శాస్త్రంలో పరిశోధన జరిపారు. అక్కడి నుంచి సోవియట్ ప్రభుత్వం ఆహ్వానం పై మాస్కోకు వెళ్లారు. 1932 ప్రాంతంలో అమెరికాలో ఆయన శ్రీ జయప్రకాశ్ నారాయణ సహాధ్యాయి. సోవియట్ యూనియన్‌లో, దాదాపు 45 సంవత్సరాలున్నారు. పెట్రో కెమికల్ పరిశ్రమను అభివృద్ధి పరచారు. 1963 లో [దాదాపు 30 సంవత్సరాల తర్వాత] సోవియట్ యూనియన్‌నుంచి మాతృదేశ సందర్శనానికి వచ్చారు. అప్పుడు భారతీయులు ఆయనకు ప్రతి చోట ఘనస్వాగతమిచ్చారు. హైదరాబాద్, విజయవాడ, మద్రాసు, మున్నగు నగరాలలోసన్మాన సభలు జరిగాయి. మద్రాసులో జరిగిన సభలో నేను [తిరుమల రామచంద్ర] క్షేమేంద్రుని కృతికి నా అనువాదమైన అవదాన కల్పలత అనే బృహద్గ్రంథాన్ని శ్రీ సీతారామయ్యకు అంకితమిచ్చాను. శ్రీ కొడవటిగంటి కుటుంబరావు, పెద్ది ఈశ్వరరావు మున్నగు వారు ప్రసంగించారు. తనకు అయాచితంగా కాకతాళీయంగా ఇలాటి అపూర్వ సన్మానం జరిగినందుకు శ్రీ సీతారామయ్య కృతజ్ఞత తెలిపారు. ఆయన వంటి మహామేధావికి పుస్తకం అంకితమిచ్చే అవకాశం కలిగినందుకు నేను ఎంతో గర్వ పడుతున్నాను.

### శ్రీ శృంగేరి శంకరాచార్యులవారి షష్టిపూర్తి

జగద్గురువులు శ్రీ శృంగేరి శంకరాచార్యుల అభినవ విద్యాతీర్థుల వారి షష్ట్యబ్ద పూర్త్యుత్సవం సెప్టెంబర్ 26 న అనంతపద్మనాభ చతుర్దశినాడు శంకరమఠంలో వైభవోపేతంగా జరిగింది. ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు తక్కిన మంత్రులు, పురప్రముఖులు, విద్వాంసులుపాల్గొని స్వామివారికి కానుకలు అర్పించారు. రెండులక్షల 50 వేల రూపాయల నిధి హైదరాబాద్ పౌరుల పక్షాన ముఖ్యమంత్రి సమర్పించారు. స్వామివారు 60 వేల రూపాయలను విద్యాసంస్థల కోసం కేటాయించి, ఆంధ్రభూమిక పండితులు శ్రీ శివలంక రాధాకృష్ణమూర్తిని ఆ నిధికి నిర్వాహకులుగా నియమించారు. శంకర మఠంలో కల్యాణమంటపం నిర్మాణానికి కొన్ని వేలు కేటాయించారు. స్వామివారు మంత్రులను, ప్రముఖులను జరీ పట్టుశాలువలతో ఆశీర్వదించారు. ఏటా గణపతి నవరాత్రుల్లో మఠంలో జరిగే విద్వత్సభ ఈ సంవత్సరం ఇక్కడ జరిగింది. దేశం నాలుగంచులనుంచి దాదాపు 200మంది విద్వాంసులు వచ్చి వివిధ శాస్త్రాలలో వాక్యార్థం చేశారు. ఆ విద్వాంసులను స్వామివారు సెప్టెంబర్ 27 వ తేదీన కాశ్మీర్ శాలువలు నగదులతో ఆశీర్వదించారు. ఈ విద్వాంసులలో కేరళనుంచి వచ్చిన బ్రాహ్మణ విద్వాంసులు శ్రీయుతులు నంబియార్ పిషారటీ మున్నగు పలుగ రైటుగురు ఉండడం విశేషం. వీరు న్యాయ వ్యాకరణ వేదాంతాలలో నిష్ణాతులు. స్థానిక విద్వాంసులు శ్రీ సన్నిధానం లక్ష్మీనారాయణమూర్తి, డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడు, డాక్టర్ బి. ఆర్. శాస్త్రి, కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, ఆంగ్రగి విశ్వేశ్వరశాస్త్రి మున్నగు వారు కూడా సన్మానాశీర్వాదాలు పొందారు.

### హోటళ్లలో ధరలు తగ్గించాలని ఆదేశం

పౌర సరఫరాలశాఖమంత్రి శ్రీ కె.రామిరెడ్డి అక్టోబర్ 8వ తేదీన నగరహోటల్ యజమానుల ప్రతినిధుల సమావేశంలో ముఖ్యంగా తిను బండారాల ధరలను తగ్గించాలని సూచించారు. పొరుగు రాష్ట్రాలు కర్నాటక, తమిళనాడులలో హోటళ్లలో ధరలు చాల తక్కువగా ఉన్నవని, ఆంధ్రప్రదేశ్‌లోని హోటళ్ళ యజమానులు స్వచ్ఛందంగా ధరలు తగ్గించకపోతే ప్రభుత్వం చర్య తీసుకొంటుందని ఆయన హెచ్చరించారు. పెద్ద పెద్ద హోటళ్లలో మంత్రులకు, కాంగ్రెస్ నాయకులకు పార్టీలిస్తున్నప్పుడు ధరలు తగ్గడం సాధ్యమా అని సామాన్యజనం భావిస్తున్నది.

### వైద్య ఆరోగ్య ప్రదర్శనం

రాష్ట్రగవర్నర్ శ్రీమతి శారదాముఖర్జీ అక్టోబర్ 5న ఉస్మానియా వైద్యకళాశాల రజతోత్సవ సందర్భంగా ప్రారంభించిన వైద్య, ఆరోగ్య, కుటుంబ నియంత్రణ ప్రదర్శనం జంటనగరాల ప్రజలను విశేషంగా ఆకర్షించి, విజ్ఞానవంతులను చేసింది. ఈ రజతోత్సవం సందర్భంగా చేపట్టిన కార్యక్రమాలను ప్రిన్సిపాల్ డాక్టర్ జి.నర్సింగరావు వివరించారు.

— తిరుమల రామచంద్ర.

### 'నెఫ్జా' నాటక కళాపరిషత్తు

నెల్లూరు ఫిలిం ఆర్టిస్ట్సు అసోసియేషన్ ఆధ్వర్యాన 1978 జనవరి రెండవ వారంలో నెఫ్జా నాటక కళా పరిషత్తు పదునాలుగవ వార్షికోత్సవం జరుగుతుంది. ఈ సందర్భంలో నెల్లూరు టౌనుహాలులో భారీయెత్తున నాటక నాటిక ఏక, బహుపాత్రాభినయ పోటీలు రాష్ట్రస్థాయిలో జరుపబడుతాయి. ప్రవాసాంధ్రులు సైతం ఈ పోటీలలో పాల్గొనవచ్చును. సినిమా నిర్మాతల దర్శకుల, నటీనటుల, ఇతర సాంకేతిక నిపుణుల పర్యవేక్షణలో పోటీలు నిర్వహించబడతాయి. దరఖాస్తులు నవంబరు 9 వ తేదీ లోపల చేరేలాగా పంపవలయును. అని కార్యదర్శి, నెఫ్జా నాటక కళా పరిషత్తు, నియర్ లీలామహల్ నెల్లూరు—524001 తెలుపుతున్నారు.

### అవీ - ఇవీ - అన్నీ



### విద్యుత్ కళాభారతి

శ్రీ పి. పార్థసారథి ప్రధాన సంపాదకత్వంలో రాష్ట్రవిద్యుచ్ఛక్తి బోర్డు సాంస్కృతికసాహితీసంఘం, విద్యుత్ సౌధ, హైదరాబాద్ —500 049వారు ప్రచురించిన 1977 వార్షిక సంచిక. ఈ సంచికలోని ఆంగ్ల, ఆంధ్ర, ఉర్దూ విభాగాలలో పలువురి రచనలను ప్రచురించారు.

### ఇదీ హృదయం

కవితాసంపుటి రచన: మాస్టర్ రవి. 66 పేజీలు, వె[...]డు రూపాయలు ప్రతులకు శ్రీ దే. రా[...]పు వల్లి 532 128.

---

పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావు కల్చరల్ అసోసియేషన్ (నెల్లూరు) వారు సెప్టెంబరు 29న శ్రీ అక్కినేని జన్మదినోత్సవాన్ని జరిపారు. సంగీత దర్శకుడు తాతినేని చలపతిరావుగార్ని పుష్పహారాలతో సన్మానిస్తున్న సంస్థ కార్యదర్శి హంసా వెంకయ్య.

# ఉత్తరాలు

(5 వ పేజీ తరువాయి)

## బొంబాయిలో

ఫటాఫట్ జయలక్ష్మి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రపత్రికలోని కథలు చాలా బాగున్నాయి. సినిమా విశేషాలను మా [మా] శ్రీనివాస్ తప్ప ఇంకొకరు ఇలా రాయలేరనిపిస్తుంది. శాంతితీరం సీరియల్ చాలా బాగుంది. మాయాజాలం పతి కట్టులో శ్రీ భావరాజు కామేష్‌గారు మ్యాజిక్‌లు చక్కగా వివరిస్తున్నారు. వారికి నా అభినందనలు.

— దీపక్, వేణు (నేలకొండపల్లి)

## హైదరాబాద్ నోట్‌బుక్

29.3.77 తేదీ గల ఆంధ్ర సచిత్ర వార పత్రిక హైదరాబాదు లేఖలో వ్రాసిన కొన్నివిషయాలు మా కుటుంబ గౌరవ ప్రతిష్టలకు భంగం కల్గించేవిగా ఉన్నవి. కీ. శే. పాలకోడేటి గురుమూర్తిగారు మా పితామహులు. వారి తమ్ముడు కీ. శే. పాలకోడేటి సూర్యప్రకాశరావుగారు 1976 సంవత్సరం జూన్‌నెలలో నిస్సంతుగా మరణించారు. సంతానంలేని కారణంగా ఆయన మా తమ్ముడిని చేరదీసి పెంచారు. పై లేఖలో పేర్కొన్న విధంగా శ్రీమతి గౌరమ్మగారు గురుమూర్తిగారితమ్ముడి కూతురు కాదు. గురుమూర్తిగారి అశేష బంధు కోటిలోని వారు. ఈమెకు రాజకీయంగా అంత పలుకుబడి లేదు. పెట్టు పేరు చెప్పి కాయలు అమ్ముకునే ఇటువంటి నాయకులకు ప్రచారం ఇచ్చి ప్రజలను తప్పు త్రోవ పట్టించడం మీ పత్రికకు శోభించదు. గౌరమ్మగారి భర్త శ్రీ గౌరీపతిగారు మాకు రాజమండ్రి వీరేశలింగం పాఠశాలలో డ్రిల్లు మాష్టరు.

పాలకోడేటి గురుమూర్తి, [కిషన్‌పుర, హనుమకొండ]



**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**



విమల్ విస్తృత శ్రేణి

మీ సూటు కోసం కావాల్సింది మూడు
మీటర్లు అందుకోసం మేము ప్రతి ఏడాది లక్షలాది
మీటర్ల సూటింగ్స్ తయారుచేస్తున్నాం.
మరి ఎంచుకోండి మీకు నచ్చినది.
విమల్ సూటింగ్ శ్రేణిలో మీకు నచ్చేవి కోకొల్లలు.




సూటింగ్స్



SIMOES/RTI/S/B